శ్రీ రఘు

# శ్రీమదధ్యాత్మరామాయణకీర్తనలు.

## బాలకాండము.

### 1. ధన్యాసి - ఆదితాళము.

పల్లవి.—నమశ్శివాయ తే నమోభవాయ.

అనుపల్లవి.—సమానాధికరహితాయ శాన్తాయ స్వప్రకాశాయ। ప్రమోదపూర్ణాయ, భక్తౌఘ, పాలనాయ నమ.

గర్వితదానవలోక, ఖణ్డనాయ శ్రీరజత। పర్వతాగ్రనిలయాయ, పావనాయ। సర్వలోకపాపపుంజ,నిర్వాపణాయశర్వాయ। దర్వీకర భూషణాయ, సర్వోత్తమాయ నమ. 1

అణ్డజాధిపవాహన కాణ్డాయ మేరుశైలకో। దణ్డాయ శితికంఠాయ పండితాయ। మండితత్రిపురజయో, ద్దండతాండవాయ బ్రహ్మాండనిలయాయ మహా, మాయాతీతాయ నమ.

మందహాసవదనార, విందసుందరాయ యోగి। బృందానందదాయ శత్రు భీకరాయ। ఇందుసూర్యాగ్నినేత్రాయ, నందిత ప్రమథగణాయ। నందివాహనాయ పోషిత, బృందారకాయ. నమ 3

నిరుపమానందఘన, నిశ్చితాయ శాశ్వతాయ। వరదాభయంకరణాయ, గిరిశాయ। తరుణేన్దుశేఖరాయ, పరమపురుషాయ భవ। హరణాయశ్రీకాళ, హస్తీశ్వరాయ. నమ. 4

గఙ్గాభఙ్గతరఙ్గ, సఙ్గతజటాజూటాయ । సఙ్గీతలోలాయ శుభ, సఙ్గతాయ। అఙ్గజాన్తసఙ్గమద, భఙ్గాయస్ఫటికోజ్జ్వ।మాఙ్గాయ శేషశై, లాధీశమిత్రాయ. నమ. 5

## 2. రేగుప్తి - అటతాళము.

పల్లవి —ఈసంశయము వారింపవే పర, మేశ నన్నా మన్నింపవే.

అను.—శ్రీసదాశివ ప్రశ్న, జేసెద వివరింపు। వాసుదేవ తత్వము, మహాత్త్వము । భాసమానవిలాస నేనిదె నీసత్కృపావలోకనమున । నీసమయమున దెలియవలసినదే సమస్తమిదే ప్రశస్తము. ఈసంశ.

జ్ఞానవిజ్ఞాననిశ్చలభక్తివైరా, గ్యానందములకు నిధానమైన విన్న । శ్రీనిలయమై వెన్నవలె మృదువై యస, మానమై సుతిగన్న, మార్గము విన్న । నైన బహుగోప్యతరమైన య, నూనముగ సెలవిమ్ము చంచల । లే నితంబినులనకు నే నీదాన దానవవైరి మ్రొక్కెద. ఈసంశ. 1

వారిజాక్ష జగదాధారమూర్తియైన, శ్రీరామునియందు సారసద్భక్తి। కారూఢమై ముక్తికారణమైయుల, రారు నొక్కయుక్తి, నాదిశక్తి। మీరరసిధీరరసికాళికి, సారకళలూరఁబలుకుముభవ । నీరధికి తారకము భక్తి, మీర సుజనులు వేరె లేరని. ఈసంశ. 2

దేవ శ్రీరాముని దేవదేవుగా ష, డ్భావాతీతునిఁ గా సుధీవరు లెల్ల । భావము రంజిల్లఁ బల్కుదు రతని, భావింతు రదియెల్లఁ, గల్లగాదె । గావునను శ్రీవిభుఁడు ముక్తికి, కేవలము తావలమమైనను । శ్రీవెలయుభూవలయమున తను, భావుఁడై జీవుఁడైనదేమి. ఈసంశయ. 3

మాయావృతుఁడై రామస్వామి సన్ముక్తి దాయకుని
గను తను దాఁ దెలియలేఁడు। వేయేల నతఁడు జూడు, ఆత్మను
తత్వవేత్తలకే నేఁడు దెలిపినాఁడు।మాయికుఁడటందు రాకకొంద
ఱి, దేయథార్థము నేఁము సుజన। ధ్యేయుఁ డెటులగు నైన
జానకి, కారెుడలఁ దానడల నేటికి. ఈసంశయ. 4

ఈవాక్యముల కర్థమీావుగా కితరులు, భావించి పలుక
నేర్పరులెవరు లేరు। దేవుఁడవై చెలువు మీారునిన్ను జేరు,
ధీరాత్ములు గోరు, కోర్కెలీడేరు। ఈవసుధ శేషశైలాధిపుఁడై
వెలుఁగు రాఘవుచరితము సు। థావర్షమై చెవులపండువు గా
వించు సేవించుజనులకు. ఈసంశయ. 5

### 3. భైరవి - అటతాళము.

పల్లవి.—వినవే సత్యవాణి శర్వాణి అలి, వేణి నీరజపాణి.

అను—వనుగోరి భజియించి, నను మదిలో నుంచి। నను వర
దాఁడనౌదు, సంశయము లేదు। మునుపు ఇటులిదియడుగ
రెవ్వరును మహాయోగివరసంభా।వనముజీవనమమృతసేవన
ము, జన్మపావనము. వినవే.

శ్రీరామునకు నమస్కారము జేసి యని। వారణనాత్మ
త, త్వము నీకు వివరింతు। నా రాఘవుఁడు శౌరి, యజ్ఞానహారి
జి। తారి శ్రీవిహారి, మాయాధారి।తారకకీర్తిప, త్యజ్ఞానస్ఫూ
ర్తివి। దారితార్తి దేవ, తాచక్రవర్తి, చిదానందమూర్తి। యై
రాజిలు శ్రీ, హరిమాయకెల్ల నా। ధారమైనందువల్ల, మోహా
ము కల్ల। శౌరి ప్రకృతికి నాదినిజమా, యారూఢిజగములు
సృజియించి య। నారతము నభము గతి వెలిలోను, పూర్ణ
తనుబూను. విన.

వితతమాయచే ని, ర్మితమైనజగము వి । స్మృతి సూచి
చుంబిత, శిలచేఁ బరిణమించు । గతియె కర్తృత్వము, అతనికి
లేదు దు । ర్మతులెఱుఁగరిదారి, కోర్కులు మీరి । మతిహీను
లైరి యే, మనవచ్చు వారిసం । సృతియె కోరియందు, చే బద్ధు
లైరి యామధుకైటభారి । అతిశుద్ధచిద్ఘనుఁ డని తెలియకజ్ఞాన।
మతనికిఁ గలదందురు, భువిలోఁ గొందఱు । తతవసుద్యుతిల
సన్మాలిక, నుతగళాన్వితమయ్యు మఱచిన । గతి మనస్థితుఁడౌ
జగద్గురుని, ఖలు లెఱుంగరని. విన. 2

అకటా సూర్యునియందు, నప్రకాశత్వము । యొకనాటి
కైనను, యున్న దేయటువలెనే। ప్రకటమైజ్యోతిస్సు, భావమాత్మ
నియందు। పనిలేదుమాయవాదు, వీవికమీఁదు। అకలంక గనవే
ని, త్యముసమ్మిమనవే ర । తికుఁడనవే శేష, శైలేశుగనవే భక్తి
యుచేకొనవే । అకుటిలునకు చాంచల్యము చెప్పుటలు చలదృ।
ష్టికిచూడనునికిసట్టు, భ్రాంతమైనట్లు । సకలకాలములను ప్రభా
మాలికిపగ లాత్రి లేనటులా । త్మకును జ్ఞానాజ్ఞానములు రెండు,
లేనివై యుండు. విన. 3

### 4. కేదారగౌళ - ఆదితాళము.

పల్లవి —సీతారామమారుతిసంవాదము, చేరివినవే శ్రీదము.

అనుపల్లవి —సీతాంశుముఖియా, చరితమునందలి । చాతుర్య
ముచూడు, సంశయమువీడు । ఖ్యాతిగ ముసు దశ,కంఠుని
రవికులజాతుఁడైనరఘురాముఁడుసబల । వ్రాతముగనుజంపి,
సాప్తుఁడై సా, కేతపురిజేరియున్నతఱిని నడిచిన. సీతా.

హాటకసింహాసనమున రాముఁడు, కోటిసూర్యసమకాం
తిని వెలుఁగుచు । పాటలాధరిధరాసుతతోడను, పరగవసిష్ఠాది

గురుబుధమిత్ర । కోటిసేవింపనాదినారాయణుఁడౌ, మేటిభక్తా
నుమోదికమలావినోది।దీటు లేకకొలువుండి హనుమంతుమనసు,
దెలిసి సీతను బలుకుమన ముద్దుగులుక । మాటికిభక్తజనాగ్రణి
కృతమతి, సాటిలేని శౌర్యధైర్యఘనుఁడును మేటియైనయనిల
సూనుగనుఁగొని, తేటముగనులోకవిమోహినిబలికెను. సీతా.1

రాముఁడు పరమానందమయుఁడు సర్వచరాచరపరి
పూర్ణుఁడవ్యయుఁడు। సామగానలోలుఁడచలుఁ డాద్యుఁడు,సర్వ
సాక్షి సుమ్ము వినిర్ముక్త । రాముఁడిదినిజమ్ము, పరమాత్ముఁడనుచు
వేమారు దెలిసికొమ్ము, భక్తులసొమ్ము । సామీరీసంశయమెల్లను
పోజిమ్ము, నామాటమదినమ్ము, ధీనిధివిగమ్ము । యేమనవలెనే
మూలప్రకృతిని, యీమహాత్ముసన్నిధానమాత్రను।ఈమహాద్భు
తము, లొనర్చుమాధులు, స్వామియందునారోపణసేయుదు
రనె. సీతా. 2

ఈకోసలపురిలో రాముఁడై దశరథునకు, నితఁడు బుట్టు
టయు విశ్వామిత్రుయాగము। సాకల్యముసేయుటయునహల్యకు
శాపము బాపుటయు, విలువిఱచినన్ను । చేకొనిచెలఁగుటయు,
పరశురాముని, డాకయడంచుటయుఁ, బురిఁజేరుటయు । కైక
వనుప దండ, కాటవికేఁగుట, ప్రాకటమాయాసీతహృతియందు
చేత । శ్రీకరురవిసుతుఁ, జేరి వాలినటు, జీరి వారినిధిగట్టి రావ
ణుని । భీకరాజిఁ దునిమి నన్నుగైకొని, సాకేతము జేరుకెల్ల
మత్కృతియనె సీతా. 3

ఆరాఘువునియం, దీవిధమజ్ఞాను, లారోపణసే,యుదురు
మధుకైట । భారినిర్వికారుఁ డఖిలాత్మకుఁడు, పరిణామరహి
తుఁడు బ్రహ్మమేయితఁడు । సూరిబృందనుతుఁడు ఆనందయు

తుఁడు, భూరిభువనహితుఁడు, సకలసమ్మతుఁడు । కారుణ్యానైర్ఘృ
ణ్య, హేయోపాదేయసుఖదుఃఖ, గమనాగమనాది,ద్వంద్వము
లు లేవీ । శ్రీరమణీయునకీవిభునెఱిఁగిన, వారిఁ జేరవెఱచిమాయ
పరువిడు । దారితారి శేషశైలశిఖరవిహారిఁ జేరి కడతేరుదారి
యిది. సీతా. 4

### ౫. సావేరి - ఆదితాళము.

పల్లవి —వినుమని శ్రీరాముఁడు తాఁ బలికెను, విశదముగను
జేరి.

అను.—జనకజచే విన్న యనిలజునికి జ్ఞాన । జనకమౌనట్లు
గాను మోదముతోను.

సమతను ఆత్మానాత్మపరాత్మల, జాడలు త్రివిధములు
పవనజ ।మమతాహంకారకర్తృత్వములన, మరినయది యాత్మ।
రమణ నన్నృతజడదుఃఖములను నీ,రసమయినది యనాత్మ, నిత్య
ము । విమలము సత్యజ్ఞానానందా, త్మిక మిదియె పరాత్మ,
మహాత్మా విను.

ఆకాశము త్రివిధం బయినట్లు ప, రాత్మ త్రివిధమా
యె, దెలియఁగ । నైకముగాను పరాకారము జ,లాశయబింబిత
మైన । చేకొని తదవచ్ఛిన్నాకాశము, చెలఁగి భిత్తియందు,
నెంతయు । ప్రాకటముగ నిటు ప్రతిబింబితమై,ప్రబలినదీచాయ,
శ్రీయాంజనేయ. విను. 2

చాతురి మీరినఖండాద్వితీయ, చైతన్యమువలన, బింబ
భూతుఁడై త్రివిధాహంకారవిరా, ట్పురుషుఁడు జూపట్టె।అతని
యందాభాసరూపమయి, భూతేంద్రియమనో, వృతమయి ।

ఖ్యాతిఁగాంచి జీవాత్మ యనఁదనరెఁ, గనుఁగొనుమీజాడ, క్రమ
ముతోడ. విను. 3

గుణమయమాయకర్తృతయ భాసం,గినజీవత్వాదిమలి
నములు । గణుతింప నవిచ్ఛిన్నమైనయవి, కారపరాత్మ,యందు।
అనయమునను నారోపణసేయుదు, రజ్ఞానులుభువిలో, నెఱుఁగక।
అనిశము శుక్తిరజతమని భ్రమయుశే,యాభాస మనఁ దగును,
దెలియనగును. విను. 4

చెలఁగు నవిచ్ఛిన్నత బ్రహ్మమఁవి,చ్ఛేదము కల్పితము,
గావున, నలభిన్నునకు పూర్ణాత్మకునైక్యము, వలనను సుజను
లచే, అలఘుతత్త్వమస్యాదిమహావా,క్యములచేఁ బ్రకటమై,
యలరెడు । వెలయఁగ నైక్యజ్ఞానము గల్గన,విద్య మాయ
మ్మాను, గుణములతోను. విను. 5

పావనులై యీక్రమ మెఱిఁగినమ,ద్భక్తులు ముత్పద
ముఁ, జెందుదు । రీవసుధను భక్తివిహీనులుగ, గర్వితులై,
దుర్మతులై। కేవలమును శాస్త్రగర్తములఁబడి, కెరలి భవశత
ముల, నొందుచు । భావము చెడి సుజ్ఞానదూరు లయి, పోవుట
నిశ్చయము, నీకేమిభయము. విను. 6

పరమ మైనయీయుపదేశము గో, ప్య మిది భక్తిలేని
వారి । కరయ నింద్రరా,జ్య మొసంగిన నియ్యకు మిది, భవహా
రము । గరిమ నఖిలవేదాంతసారసం,గ్రహము శుభావహము,
కనుఁగొను । సురుచిరశేషాచలశిఖరనివా, సుఁడ నై భువిలోను,
వెలసినాను. విను. 7

6. కాంభోజి - ఆదితాళము.

పల్లవి— నే ధన్యనైతి నే జగత్ప్రభో, సాధులోకవిభో.

అను—మాధవ చరణారవింద, మకరందము గ్రోలఁ గల్గె. నే ధన్య.

మునుమిడి సంశయ మనే, ముడి వీడె నీయనుగ్రహా। మున రామ తత్త్వము సంక్షేప, ముగ వింటి కడతేర గంటి। మనసుతనివి దీరదాయె। మన్నింపవే దైవరాయ, అనువందనిను జేరమాయ, యతిదూరమై తొలఁగిపోయె. నే ధన్య. 1

అద్వితీయాఖండపరిపూ,ర్ణానంద వారిధిలోన। చిద్విలా సోల్లాసినై రం,జిల్లఁ జేసి నన్నుడాసి। హృద్వికాస మొనరించి, హితవాక్యము లుపదేశించుటచే। విద్వన్నుత శంకర వి, శ్వేశ శంభో మహాదేవ నే ధన్య. 2

స్వామీ నే నీచేవిన్న యీచరితము నవరసభరితము, వేమారు దీని వినఁ బల్కు, వీను లమృతముఁజిల్కు, శ్రీమహి శాభిరాముఁడై, శేషాద్రిధాముఁ డైన శ్రీరాముని దేవతా సార్వ, భౌముని నీవలన దెలిసి నే ధన్య. 3

### 7. గౌళిపంతు - ఆదితాళము.

పల్లవి—వినుము ధరాధరవరతనయా ధృత, వినయా సరస గుణాభినయా.

అను—చనువుమీర నన్నడిగిన యీశుభ, చరితము పాతకు రితము యిది నిరతము. వినుము.

రావణాదిదుష్టాసురకోటుల, మోవలేక భరపీడితమై భూ।దేవి విమల గోరూపము గైకొని, శ్రీవిలసిలు బ్రహ్మలోక మునకు।ఠీవిగ నేఁగి విరించిచరణరా,జీవము లశ్రుకణమ్ములఁదడ పుచు। సావధానముగ మ్రొక్కి వినతయై తా వచ్చుట విను పించె విశదముగ. వినుము. 1

వనజభవుం డోకముహూర్తమాత్రము, మనమునసంత
యము నూహచేసి క్రొ। న్ననవిల్తునితండ్రిని గనుఁగొనుటకు, ముని
సురపరివృతుఁడై భారాసహితము। గను చని క్షీరసముద్రతీర
మున, ననుపమభక్తి వినమ్రుఁడై హరిని। వినుతించెను వేదాంత
వాక్యముల, ఘనవిన యానందములు పురిగొన. వినుము. 2

కోటిసహస్రాంశు సముప్రభచే, వాటికి దిక్కులు తేట
ముసేయుచు। హాటకాంబరము కటిపై వెలుఁగ కిరీటహారకే
యూరకాంతులు ల। లాటకంఠబాహువులను దనరగ, మేటి
కౌస్తుభశ్రీవత్సములకు। నాటపట్టయి చతుర్భుజుఁ డగుచు ని,
శాటవైరి గనుపట్టె మోదమున. వినుము. 3

గరుడవాహనారూఢుఁడు కమలా,ధరణీయువతీయుగళ
యుతుఁడు శం।ఖరథాంగగదాపద్మవిరాజితుఁడురుతరవనమాలి
కాభిరాముఁడు। ధర నీరేజవిశాలలోచనుఁడు, నరవరామృతక
రుణాలోకనుఁ డగు। హరిచరణద్వయి శిరము సోఁకగను, సర
సిజగర్భుఁడు మ్రొక్కి పలికె నది. వినుము. 4

తనువు మనసు ప్రాణము లింద్రియములు, వినుత నిశ్చ
యాత్మిక మగుమతితో। నొనగూర్చి భవత్పదవినతుఁడ నై,
తినని సుహృత్పుండరీకమునకును। గొని నిరతానందాను
భవంబున, నెనయువారు భవరహితుల భవత్రిభు। వనముపుట్టి
పెరిగిగెడయు టిదినీ, ఘనమాయగదాయనె పితామహుఁడు.
విను. 5

సూరిజనులు వేదాంతమునందలి, సారవిచారము చేసి
ఘోరసం।సారరుక్పీడితుల కౌషధంబు, దారభక్తి యనిపల్కిరి
గానయు। నారత మది దయ జేయు మనిన విని. శౌరి యజుని,

కరుణార్ద్రదృష్టిచే । నారసి నీయభిమతము లొసంగుదుఁ, గోరు మనినసుత్సుకుఁడై పలికెను. వినుము. 6

శ్రీలలనాధిప చిత్తగింపుమీ, భూలోకమునను రావణుఁ డనఁగా।పౌలస్త్యునిసుతుఁ డొకఁడు గలఁడు సువి,శాలమైతగు మదీయవరంబున । మేలుజెంది సురకంటకుఁడై కడు, చాని యున్న వాఁడతనికి మర్త్యుని । చే లయంబు విధియించితి దను జుని, నీవా మనుజుఁడవై వధింపు మనె. వినుము. 7

వనజోదరుఁ డిట్లనియెను కశ్యప, ముని మును ననుతన యుని గమ్మని వేఁ । డిన నే సమ్మతిపడితి నిపు డితం, డినకుల మున దశరథుఁడై నా డా । ఘనునకు కౌసల్యకు పుత్రుఁడనై, జనియించెద నిజయోగమాయయె । జనకునియింటను సీత యగునుపా,మ్మనిచక్రి తిరోధానము నొందెను. వినుము. 8

సురలకు నిట్లనియెను చతురాస్యుఁడు, హరివాక్యము లెల్లవింటిరేవా । నరుల సృజింపుఁడు మాయంశములను, పర మేశునకు సహాయము సేయుఁడు । పరమసమ్మతంబగు ననుచు వసుం,ధరనూరడించి నిజనివాసమున । కరిగె నలువ శేషాచల వాసుని, శరణాగతవత్సలుఁ డది పొగడుచు. వినుము. 9

8. కన్నడ - ఆదితాళము.

పల్లవి—అందముగ నీకథవినవే రజ, తాచలసదనా, పరిహాసి తవి । నిందితారవింద చంద్రవదనా, కుందబృందసుందర రదనా.

అను—మందయాన దశరథవసుధేశుఁడు, మాన్యయశుఁడ యోధ్యా, కాంతుఁడు పొందుగఁ దనయులు లేనందుకు వగఁ, జెంది వసిష్ఠునిఁజేరి పల్కెనా. నంద.

మనవివినుముస్వామీనాకిఁక శ్రీమంతులైసుతులు, ఏవె
ర । వునజనియించెద రాత్మజహీనునకు ధనంబు సుఖకరంబు
గాదుగదా । అనిన రాజుకనియె నావసిష్ఠుఁడు, జననాయకనీకు,
కొడుకులు । ఘనులమనయశోధనులునల్వురిక, గల్గెదరందు
కుపాయముగలదనె. నంద. 1

శాంతుఁడైన ఋశ్యశృంగ మహానీశ్వరుని బిలువనంపు
మీఁవుని । తాంతపుత్రకామేష్టినిరంతర, సంతోషస్వాంతుఁడ
వై యొనరింపు।మంతయుఁద్వరగాననుఁడును శాంతా, కాంతుని
రావించి, రిపుదు । ర్దాంతుఁడు మునిపరివృతుఁడై సరయువు, చెంత
యజ్ఞదీక్ష చేకొనినిలిచె. నంద. 2

వేదమంత్రములు బలుకుచు శుచియై, వేల్వగహుత
వహుఁడు, హవ్యము । సాదరముగఁగైకొనితగఁబ్రదక్షి,ణార్చు
లలరజ్వలియించెనువసుప్రభుఁడై । ఖేదహరుఁడుయజ్ఞేశుఁడుదశ
రథ, మేదినీశ్వరునకు, శుభసం । పాదకమగుపాయసపాత్రమొ
సఁగి, పరమాత్ముఁడుసుతుఁడగునీకనిచనె. నంద. 3

లలి నలరిరి మహానులుబ్ధమనో, రథుఁడై దశరథుఁడు,
ముదమునఁ । జెలఁగుచు ఋశ్యశృంగవసిష్ఠుల, చేననుజ్ఞఁగొని
హావిస్సువేడుకను । కలితగుణుఁడు కౌసల్యకుసగమును, కైకకు
సగమొసఁగ, వారలు । దెలిసి సుమిత్రకుదమయంశములం, దెల
మిసగముసగ మొసఁగిరి నిరతా, నంద. 4

పరమాన్నము భుజియించినముప్వరు, తరుణులుగర్భిణు
లై, వెలిఁగిరి । నిరతముసురకాంతలనఁగఁదొమ్మిది, నెలలునిండ
కౌసల్యగనెనుసుతుని । పరఁగఁజైత్రశుద్ధనవమిని పున, ర్వసున.

క్షేత్రమున, సుమనో । హర కర్కాటకలగ్నమునను శేషాచలే
శుఁడగుహరిజనియించెసా. నంద. 5

9. శంకరాభరణము - అటతాళము.

పల్లవి — శ్రీరాముని గాంచెను, పార్వతీవినవే-మనకౌసల్యయా,
త్మా రాముని గాంచెను.

అను. — తోరమైహర్షాశ్రు, పూరముకన్నుల । జారభయసంభ్ర
మా, శ్చర్యములైనఁగొనఁగా. శ్రీరాముని.

అలనల్లకలువఱేఁ, కులచాయ మేనిచేఁ । జెలఁగువాని
పసిఁడి, చేలఁగట్టినవాని । వెలయునాల్గుభుజ, ములవాని కను
గొల్కుల నరుణరేఖలు, కలవాని స్వర్ణకుం । డలలసితగండ
మం,డలములవానియ।స్ఖలితరవికోటి ప్ర,కాశుని రత్నో।జ్జ్వలకి
రీటము వాని, నళినీలకుటిలకుం, తలముల చేముద్దు, గులుకుచుం
డెడివాని. శ్రీరా. 1

ఘనతరశంఖచక్రగదాబ్జములవాని । వనమాలికయురు
తదనరువాని చిఱున । వ్వను వెన్నెలలా. ననచంద్రుఁడు దిక్కు।
లను వెదచల్లఁజే, ల్వెలలారెడువాని । యనుపమానకరు, ణామృ
తపూర్ణనే । త్రునిమంజీరాంగ, దునిశ్రీవత్సకటకకం । కణ
హారకేయూర, కౌస్తుభాదిభూ, షణభూషితునిఁజూచి తనివిదీ
రక తిరుగ. శ్రీరా. 2

శరణాగతులను, కరుణరక్షించుశ్రీ,ధరనీకు బహువం-
దనములొనర్చెద । శరణుగర్వితదనుజ,చయవిరామరామ। శర
ణుదేవతా, సార్వభౌమ నీవే । పరమాత్ముఁడవుజగ, త్పతివీశుఁ
డవు హరివి । వరయోగిబృందహృ, ద్వనజకర్ణికాం । తరమున

సురుచిర, రాకాజ్యోతివై మెఱయునిన్నెన్న నా, తరముగాదని తిరుగ. శ్రీరా. 3

ఈశనీవునిఖి, లేంద్రియసాక్షివి । శ్రీశుఁడవీవిశ్వ, సృష్టి సంరక్షణ । నాశములొకటను, జేసినేయకయున్న । వాశిచేఁ బోయి, పోవనివాఁడవై ప్రకృతి । డాశిడాయనివాఁడ, వై శాశ్వతుఁడవై యా । కాశాదిభూతసం, ఘములకెల్ల నవ । కాశమై నీవుప్ర, కాశింతువిదిమాయపాశాదిబద్ధుల కెఱుఁగ వశముగాదని తిరుగ. శ్రీరా. 4

నీజఠరమునంద, నేకబ్రహ్మాండము లీ । యోజఁబరమాణువులై, యున్నవిప్పుడునీవు । రాజిల్లునాయుద, రమునబుట్టుట కల్ప । భూజమునుముంగిట, మొలచి నట్లయ్యెనం । భోజాక్షపతి ధన, పుత్రాదిసక్తనై । నేజెల్ల సంసార, నీరధిఁబడనొల్ల । శ్రీ జాని నీశరణు, జెందితి నామదిని । తేజరిల్లుచునుసు, స్థిరుఁడవు గమ్మని. శ్రీరా. 5

ఈయఖిలమునుమో, హింపఁజేయునీదు । మాయకు నగుపడ, జేయకునను శేష! శాయియీరూపము, సంహరింపఁగ దోయి । కాయజజనక చక్రనిముద్దుపట్టివై । హాయిగానన్న లర, జేయుమమితానంద । దాయివనినిసుమదిని, దలఁతురు ఘను లెల్ల । మాయురేయనుచువే, మారునువినుతించి । శ్రీయుతమూర్తియా, శేషాచలేశుఁడా. శ్రీరాముని. 6

10. ముఖారి - ఆదితాళము.

పల్లవి.—రామునిసకలగుణాభి, రామునినిఖిలరాక్షసవి, రాముని వర్ణింపవశమా.

క్షత్రమున, సుమనో । హర కర్కాటకలగ్నమునను శేషాచలే
శుఁడగుహరిజనియించెసా. నంద. 5

## 9. శంకరాభరణము - అటతాళము.

పల్లవి — శ్రీరామునిగాంచెను, పార్వతీవినవే-మనకౌసల్యయా,
త్మారామునిగాంచెను.

అను.— తోరమైహర్షాశ్రు, పూరముకన్నుల । జారభయసంభ్ర
మా, శ్చర్యములైనఁగొనఁగా. శ్రీరాముని.

అలనల్లకలువతే, కులచాయమేనిచేఁ । జెలఁగువాని
పసిఁడి, చేలఁగట్టినవాని । వెలయునాల్గుభుజ, ములవాని కను
గొల్కుల నరుణరేఖలు, కలవాని స్వర్ణకుం । డలలసితగండ
మం,డలములవానియ।స్ఖలితరవికోటి ప్ర,కాశుని రత్నో।జ్జ్వలకి
రీటమువాని, నళినీలకుటిలకుం, తలములచేముద్దు, గులుకుచుం
డెడివాని. శ్రీరా. 1

ఘనతరశంఖచక్రగదాబ్జములవాని । వనమాలికయురు
తదనరువాని చిఱున । వ్వనువెన్నెలలా. ననచంద్రుఁడు దిక్కు।
లనువెదచల్లఁజె, ల్వలరెడువాని । యనుపమానకరు, ణామృ
తపూర్ణనే । త్రునిమంజీరాంగ, దునిశ్రీవత్సకటకకం । కణ
హారకేయూర, కౌస్తుభాదిభూ, షణభూషితునిఁజూచి తనివిదీ
రక తిరుగ. శ్రీరా. 2

శరణాగతులను, కరుణరక్షించుశ్రీ,ధరనీకు బహువం,
దనములొనర్చెద । శరణుగర్వితదనుజ,చయవిరామరామ। శర
ణుదేవతా, సార్వభౌమ నీవే । పరమాత్ముఁడవుజగ, త్పతివీశుఁ
డవు హరివి । వరయోగిబృందహృ, ద్వనజకర్ణికాం । తరమున

సురుచిర, రాకాజ్యోతివై మెఱయునిన్నెన్న నా, తరముగాదని తిరుగ. శ్రీరా. 3

ఈశనీవునిఖి, లేంద్రియసాక్షివి । శ్రీశుఁడవీవిశ్వ, సృష్టి సంరక్షణ । నాశములొకటను, జేసిసేయకయున్న । వాశిచేఁ బోయి, పోవనివాఁడవై ప్రకృతి । డాశిడాయనివాఁడ, వై శాశ్వతుఁడవై యా । కాశాదిభూతసం, ఘములకెల్ల నవ । కాశమై నీవు ప్ర,కాశింతువిదిమాయపాశాదిబద్ధుల కెఱుఁగ వశముగాదని తిరుగ. శ్రీరా. 4

నీజఠరమునంద, నేకబ్రహ్మాండము లీ । యోజఁబరమాణువులై, యున్నవిప్పుడునీవు । రాజిల్లునాయుద,రముఁనబుట్టుట కల్ప । భూజనుముంగిట, మొలచి నట్లయ్యెనం । భోజాక్షపతి ధన, పుత్రాదిసక్తనై । నేజెల్ల సంసార, నీరధిఁబడనొల్ల । శ్రీజాని నీశరణు, జెందితి నామదిని । తేజరిల్లుచునుస్థిరుఁడవు గమ్మని. శ్రీరా. 5

ఈయఖిలమునుమో, హింపఁజేయునీదు । మాయకు నగుపడ, జేయకునను శేష! శాయియీరూపము, సంహరింపఁగ దోయి । కాయజజనక చ,క్కనిముద్దుపట్టినై । హాయిగానన్నలర, జేయుముమితానంద । దాయివనినినుమదిని, దలఁతురు ఘను లెల్ల । మాయురేయనుచువే, మారునువినుతించి । శ్రీయుతమూర్తియా, శేషాచలేశుఁడా. శ్రీరాముని. 6

## 10. ముఖారి - ఆదితాళము.

పల్లవి.—రామునిసకలగుణాభి, రామునినిఖిలరాక్షసవి, రాముని వర్ణింపవశమా.

అను — వేమాఱుకౌసల్యనీవే, మేమి గోరినావదియెల్ల । శ్రీ
మీఁజనొసఁగితిననుచు, ప్రేమచేజననితోఁబలికిన. రాముని.

మున్ను బ్రహ్మానన్ను వేఁడు, కొన్న భూభారముదీర్ప । వ
న్నె మీఱఁగను నేఁడు, నీగర్భమున । జెన్నలరఁబుట్టితిఁ జూడు,
రావణాసురుఁడన్నిటగర్వించినాఁడు, వానివధియించి । సన్నుతి
గాంతు నీ రేడు, జగములలోన । మున్నలరదశరథుఁడు నీవు,
నన్ను దపమున మెప్పించి । కన్నారు నీవదితివతఁడు, కశ్యపుఁడని
కౌసల్యకుఁ దెలిపిన. రాముని. 1

అనుచుఁ దల్లితోఁ బలికి, హరి ముద్దుబాలుఁడై కలికి ।
తనమున హరి నీలగాత్రుఁడై, వికసితనవ్య । వనజదళవిశాల
నేత్రుఁడై, చక్కనివాఁడనుచునుతియించపాత్రుఁడై, అమలప్ర
కాశమునకుఁ జూడఁదరుణమిత్రుఁడై, విలసిల్లెనంత । ఘనుఁడైన
తనయుఁడుగల్గె, ననివినిదశరథుఁడానంద । మునను గురునితోఁ
డఁగూడి, చనుదెంచికన్గొనెను శ్రీరఘు. రాముని. 2

విరులవానలపుడుగురిసె, వేడ్కజయదుందుభులు మొర
సె । సురసుందరులెలమినాడిరి, గంధర్వవరులు । సరసులై రాగ
ములుబాడిరి, మానులుదోషా । చరులవలనిభయమువీడిరి, పౌ
రులానంద । కరునిచూడఁగుమిగూడిరి, దశదిశలయందు । పరిమళ
మిళితములైన తెమ్మెరలువిసరెదివినిసురలు । వరవిమానారూఢు
లై శ్రీ, హరిహరియని మ్రొక్కిరాత్మా. రాము. 3

ఘనవిభుఁడైనకొమరుని, గనెను కైకచంద్రబింబానన
లను సుమిత్రగనెను, సుతులనిర్వురను । మొనసిసంతోషమున
ను, దశరథుండుసకల । ధనములవిప్రులదనిపెను, వసిష్ఠమహా ।
ముని యాబాలురకు క్రమమునను రామభరతలక్ష్మణశత్రుఘ్న

లనుచునామకరణములొనరించె భరతుండును శత్రుఘ్నుఁడు జోడై లక్ష్మణుఁడుననుసరించెనుదశరథ. రాము. 4

చెలఁగిసౌమిత్రితోఁగూడ, మెలఁగుచుఁదేనియలొలుకఁ। బలుకుసుతుని నృపుఁడుగాంచి, భూషణజాల । ములతోడనలంక రించిశిస్తుగఁగస్తూరి। తిలకమునుదుటనుంచి, గళమునరత్న।కలిత హారములుగీలించి, ముద్దాడునపుడు । కలకల నవ్వుచు మద్ది, కాయలల్లాడనందియలు । ఘులుఘుల్లుఘుల్లనుచుమ్రోయ, లలిత గతులనటియించు శ్రీ. రాముని 5

చిన్నారిబొజ్జలోనన్ను, గన్నవాఁడానాపాలిటి । పెన్ని ధానమరారా, యోరినాచిన్ని।యన్నబూచివచ్చేరారా, పరుగె త్తవల । దన్ననాతోనలుగమేరా, పాటబాడుచు । నిన్నులాలి యూచేరారా లాలబోసేను । మన్నుచేతనంటవద్దు వెన్నబెట్టె ననుచుచాలా । మన్నించిపలుకు కౌసల్యను, మురులురెట్టింపఁ జేయుశ్రీ. రాముని 6

ధరణివిభుఁడు భుజియించు, తఱిని కౌసల్యతనయుని । మురిపెమునరక్షనుచుఁ జేర, వరయోగిహృదయుం । తరము నందుఁ జెలువ్వనిూన, వసియించు దేవుఁడు । చిరుత వాఁడయిముద్దు గార, వచ్చినజూచి।తరుణితనదుకొర్కెలుమీర, కౌఁగిటనుంచి । కరుణించిభుజియించుమనిన, కబళముచేనందుకొని । తిరుగానాట లాడుపరుగె, త్తినమాయాబాలకుఁడౌ శ్రీ. రాముని. 7

వితతయశుఁడుదశరథభూ, విభుఁడంతటకౌమారా । న్వి తులసుతులఁదిలకించి, యుపనయనములు। నతులముగ నొనరించి, వసిష్ఠునొద్ద।శ్రుతులనెల్లజదివించి, చతురంగముల। గతులదెలియ నేర్పరించి, చౌషష్టివిద్యల। చతురులనుగావించి, హర్షించవారు

సతతము గురుబంధుమిత్ర, జనులకెల్ల హితులై ధైర్యో। న్నతులై పరగిరందులో శ్రీ, యుతుఁ డయిసత్యవ్రతుఁడై నశ్రీ. రాముని.

తల్లిదండ్రులకు ప్రియము, దనరగ నశ్వము నెక్కి।విల్లు నమ్ములుచేపట్టి, వేఁటలాడుచు। మొల్లమునడవినున్నట్టి, మృగములగుండెలు। ఝల్లుఝల్లనఁ జుట్టిముట్టి, పోనీకవాని। నెల్లచల పట్టిపడఁగొట్టి సౌమిత్రిఁగూడి। బల్లిదుఁడై యన్నియయోధ్యా, వల్లభునకు కాన్కజేసి। సల్లలితుఁడై సకలజనుల, సవినయగాఁ బాలించు శ్రీ. రాముని. 9

శైలరాజకన్యకా యీ, చందమున మనుజావతార।లీల మెవర్తించె శౌరి, కనుఁగొనుమింద్ర। జాలికుఁడు చక్రధారి, సమస్తవేద। మూలమైవిలసిల్లుదారి, యజ్ఞులు దెలియఁ। జాలరతఁడు నిర్వికారి, విమతసంహారి। శ్రీలచేఁ జెలువందు శేష, శైలశిఖరాగ్రవిహారణ। శీలుఁడై సద్భక్తలోక, పాలుఁడై దనరు నిత్యాత్మ రాముని. 10

## 11. నాదనామక్రియ - అటతాళము.

పల్లవి —ఇందువదనా వినవె యీచరితము, కుందరదనా.

అను —డెందము శ్రీమన్ముకుందుని పాదార। విందములందా, నందింపఁజేసి రా. కేందు.

ధీరుఁడు విశ్వామిత్రుఁడు తాన యోధ్యకు। శ్రీరామునిఁ జూడవచ్చెను, అని। వార్యుఁడై సౌధముఁజొచ్చెను, ఎదురు॥గా రాజుచనితోడితెచ్చెను, మునికి। చారుసింహాసన మిచ్చెను, మహా। దారుఁడై పూజయొనర్చెను, కరము। లారూఢిని నొదల జేర్చెనుస్వామి। మీరువచ్చుటకేమి, కారణ మది దెల్పుఁ। డీ రాజ్యమైనమీ, కిచ్చెద ననెను రా. కేందు. 1

కౌశికుఁడాపూజఁ, గైకొని పల్కెభూ। మీశమరీచసు
బాహులు, మాం। సాశనులద్భుతదేహులు, ఘోర। పైశాచి
ప్రేతవాహులు, కాల। పాశవిడంబితబాహులు, దివి। జేశాది
సురమునిద్రోహులు, యజ్ఞ। నాశకు లధికదుర్మోహులు, గా।
డాసి వారలపొగర,డంచసలక్ష్మణుని। జేసి రామునిబంపు, మీ
శుభమౌనని. ఇందు. 2

భూమీశుఁడే కాంత,మునవసిష్ఠుతోఁ బల్కె। నేమిసేయు
దునేమందును, నెట్లు। రామునినెడబాసి యుందును, సుగుణ।
ధాముఁనెన్నఁడుగనుగొందును, గురు। స్వామియెవ్విధిసుఖము
జెందును, ఈవి। శ్వామిత్రునుడియెటువిందును, ఇతని। కేమి
మనవి జేసికొందును, నేను। యీమాట వినకున్న, నిపుడెశాప
మిచ్చు। నీమౌనియనినగురుఁ, డిట్లనియనెను రా. కేందు. 3

నరవరవినుమిది, పరమరహస్యము। నరుఁడా శ్రీరఘురా
ముఁడు, ఘోర। దురితాంధకారవిరాముఁడు, హరి। పరమా
త్ముఁడు కమలాకాముఁడు, భక్త। వరదుఁడు ప్రణతసుత్రా
ముఁడు, దిన।కరవంశజలనిధిసోముఁడు, మౌని। వరదేవతాసా
ర్వభౌముఁడు, ఇతఁడు। పరమేష్ఠిచేతొల్లి, ప్రార్థితుఁడయిభూ
మి, భవముమాన్పనీ, వరతనయుఁడాయెనని నిందు. 4

రాజానీవు కశ్యపబ్రహ్మావుకౌసల్య! జేజేలకెల్లనుతల్లి, అ
దితి। నాజనుతరుణీమతల్లి, మీరు। శ్రీజానిభజియించితొల్లి,
చాలా। పూజింప నతఁడుల్లసిల్లి, సుతుఁడ। నైజనించెదమీకు
నెల్లి, ననియ। వ్యాజకరుణారసముఁజల్లి, నేఁడు। రాజీవాక్షుఁ
డురాముఁ, డైజూపట్టె శేషుఁ। డేజామిలక్ష్మణుఁ, డిదినిజమనె
నురా. కేందు. 5

వరశంఖచక్రము, ల్భరతశత్రుఘ్నులై । రరుదారహరి
యాజ్ఞచేత, సుర । చిరయోగమాయయె సీత,యనఁగ । మెఱసి
జనకవంశజాత, యై । పరగుచున్నది ధీసమేత, వినుత । సరస
సద్గుణమణివ్రాత, యిది । పరమగోప్యముసల, క్ష్మణుని రాముని
మౌని । వరువెంటబంపుమని, బల్కె వసిష్ఠుఁ డిందు. 6

రామలక్ష్మణులను, రాజుపిలువఁబంచి । ప్రేమతోఁ గౌఁగి
టనుంచెను, తనమహా । మహిమనునుతియించెను, తన । దేమ
హాద్భాగ్యమనియెంచెను, వి । శ్వామిత్రుఁ జాలపూజించెను,
ఘన। శ్యాముని నతనికర్పించెను శుభ।మౌ మీఁకనిదీవించెను, శ్రీ
రాములంతటధను, ర్బాణతూణీరధరు । లైమించి మునివెంట,
నతిమోదమునజని రిందు. 7

లలినిబలాతిబ,లలను రెండువి । ద్యలు రామునకు మౌని
యిచ్చెను, రాముఁ । డలరి గంగానదిని మెచ్చెను, ఆ।వలఁబోవఁ
దాఁటకి, వచ్చెను, దాని । బొలియింపముని సెలవిచ్చెను, ఒక్క ।
ములికియురమ్మున గ్రుచ్చెను, దనుజ । విలవిలతన్నుక చచ్చెను,
ఆ వెలఁదియాబిడరూపు, విడియ కుసతియై । చెలఁగి రాముని
బొగడి, శ్రీమీఱజనెను రా. కేందు. 8

కౌఁగిట రాముని, గదియించి జడదారి, వేగమే శిరము
ముద్దాడెను, అంత। బాగాయె నని కొనియాడెను, మహా। యోగి
ధ్యేయుఁడవనుచు వేఁడెను, హర్ష। సాగరముననోలలాడెను, మ
హా। భాగుఁడుముదమున, గూడెను వీత। రాగుఁడై భయమెల్లవీ
డెను నిగ। మాగమ మంత్రర,హస్యము లను దెల్పె । నీగతి శేషగి,
రీశుఁడౌ హరికి రా. కేందు. 9

### 12. సౌరాష్ట్ర - ఆదితాళము.

పల్లవి.—వినవే సుగుణాన్వితా, గిరిరాజసుతా.

అనుపల్లవి.—మునియుతులై రాఘవులు కామాశ్రమ। మునను నాఁడునిలిచి వేకువ । ఘనులుసిద్ధాశ్రమగతులై రచటి । ముని లా రాఘవులను బూజించిరి. వినవే.

శ్రీరఘురాముని, చే ననుజ్ఞఁ గొని । సారయశుఁడు విశ్వామిత్రుఁడు క్రతు । వారంభించె ను, హాజనవృతుఁడై । సారె కుమారీ, చసుబాహులస్ర । గ్ధారలుగురిసి రహా । ధీరుఁడు దాశర, థిమహోద్ధతుఁడై । మారీచుననిల, మార్గణమున । వారిధిలోఁబడ, వైచిసుబాహుని । దారితుఁజేసెను, దహనాస్త్రమునను. వినవే. 1

సునిశితబాణము, లను సౌమిత్రిత । దనుచరులను జంపెనుబుష్పలజడి నెనసి సురలుగురి, యించిరి సంభ్రమ । మునను గుశికసుతుఁ డినకులతిలకుని । తనతోడ నిడికొని । నెనరునఁగౌఁగిట నునిచి లక్ష్మణుని, మునునిడికొనియా, డి ఫలములు, అనఘులకునుభోజనములొనర్చెను, దినములుమూఁడిటు, జనెనుసరసముగ. విన. 2

మునిపతిశ్రీరా, మునితోఁబలికెను । జనకునియాగము, గనుఁగొనఁజనియెద।నను వుగ మీరు వచ్చిన శుభ మానని।వినతుఁ డగుచు నను, జనిఁగూడి తపో।ధను వెంటముదముతోఁ। జనిచనియెదుటను, వన మొకటిఫలకు, మన స్తరులతాలం, కృతమై జనవిరహితమై, గనుపట్టినదీ, వనమేమనరా, మునితో మునిబలికె. వినవే 3

గౌతముఁ డనుముని, గలఁడుపలోకవి । ఖ్యాతుఁ డాతని

క, హల్యయనుసతిని । ధాతయొసంగెనా, దంపతు లిచ్చట। బ్రీతి నుండనిం, ద్రుడు నొకనాఁడా । గౌతమవేషమున । నాతినె నసిచను, నాతరిస్నాతుఁడై । గౌతమమునివచ్చి, భస్మీ । భూతుఁ జేతునాతో బొంకకుమనఁ బురు । హూతుఁడు దుర్మతి నైతి గావు మనెను. విన వే. 4

శాప మొసంగెను, సహస్రభగుఁడ । వై పొమ్మనివృత్రారినహల్యను । కోపమునశిలా, రూపము గమ్మనె । నేపరజంతుర, హితముగఁజేసెను।యీవనమూమాని। బాపురేయెన్నఁడు నీపై రఘుపతి, శ్రీపాదము వెట్టు, నాఁటికి । శాపము చెడునని, జనెసతీమణికి, పాపము బాపవె, పరమపురుషా యనెను. విన వే.

రామునికరముక, రమ్మునఁబట్టి మ । హామునియప్పుడ, హల్యనుజూపిన।భామపైని దన, పాదమునుంచి మ।హామతియగుచున, హల్యతనరఁగని, రాముఁడుతా మ్రొక్కె । రామామణియు సలక్ష్మణునిధను, ర్బాణధరుని కనకాం, బరుని । శ్రీమన్మందస్మితవదనుని శ్రీ, రాముని శేషాద్రి । ధామునిఁజూచెను. విన వే. 6

### 13. బిలహరి-అటతాళము.

పల్లవి.—శరణు శరణని రామ, చంద్రుని యహల్య । సన్నుతించెను విన వే.

అనుపల్లవి.—పరమపురుషుఁడనుచు, గౌతమవాక్య । సరణిమదిలోనెన్నుచు। శౌరికిమ్రొక్కె।యరుదా, ర నర్ఘ్యపా, ద్యములిచ్చిహర్షవి । స్ఫురితాత్మయైమించి, పులకించి నీ । చరణనీరజపరాగమునను, దురితమెల్లను, దొలఁగెనహాహా।గరిమతో నుగృ, తార్థనైతి జ।గత్ప్రభో కమ, లావిభోహరి. శరణు.

యేవిభు పాదరాజీవ రేణువులచేఁ, బావనమైనది భాగీర
థీమహా। దేవబ్రహ్మాదిసు, రావళి నేమహానుభావుఁడు గావించె,
నేవరదు పదరజము। వేవేలవిధములఁ వెదుకఁబడును శ్రు
తుల। చేవనజభవుఁ డెవని, శ్రీనాభిపద్మమం। దావిర్భవించె
న,వ్యయుఁడైనపురవైరి। యేవిశ్వగురునామ, మేప్రొద్దుభజి
యించు। నేవీరవరుపాద, మీభువనజాలముల, నెల్ల నాక్రమిం
చెను। శ్రీవనితామణికి నెవ్వనియురము,చెలఁగి విహరింప నునికి
పట్టయ్యె నే। దేవునిపదమునిందితరాజయోగి హృ, ద్ధ్యేయమై
తనరారిచెలువుమీఱు।నావిభుండా వరదుఁడా గురుఁడాపరుం
డాదేవుఁ డిదెనను। బ్రోవుటకు ప్రత్యక్షమయ్యెనహా విచిత్రము
టంచునెంచుచు. శరణు. 1

శ్రీరఘువరనీ, లీలలత్యద్భుతము। లేరికితరముగాదివి
తెలియమర్త్యావ। తారమునను జగ, త్త్రయము మాయా
మోహా।పారవశ్యము నొంద, భ్రమియించితివి నిర్వి।కారుఁడవీ
వుచలనాది రహితుఁడవు వి।కారచలనాదులు, గలవారివలెనుం
దు।వారయపూర్ణుఁడ, వానందమయుఁడవ। క్రూరుఁడ వతిమా
యి, కుఁడవు సంవిస్మయో।దారవిశుద్ధుఁడ వాత్మ ప్రజ్ఞాఖండబో,
ధస్వరూపుఁడ వజుఁడవు।పారమార్థికుఁడ వీ, వేభూతములకా,
ధారభూతమునీవే, యీజగమునీవే, సారెకుజగదా, శ్రయుఁడ
వీవేకర్త్ర।కారణకార్యములు నీవిలాసములు। చేరికన్గొనఁగ నేర
కతనుధారివందురుగానినిన్ను। విదారితాఖిలకలుష మగుపరత
త్త్వమునఖిలులచే నగునా. శరణు. 2

జలజలోచసనీ, వలఘుమాయాగుణములచే బింబితుఁడ
వై,విలసిల్లిజగదుదయ। విలయములకు బ్రహ్మా, విష్ణ్వీశ్వరనామ।

ములఁబూనియున్నావు, తెలియఁగనొకఁడవై। వలనుమీఱగాను,
వాచ్యవాచకభేద। ములజగన్మయుఁడవె, యలరుచుందువునీ వ।
స్ఖలితతేజుఁడవోం, కారవాచ్యుఁడవువా। క్కులకగోచరుఁ.
డవు। గూఢవర్తనుఁడవు। భళిభళిశ్రీరామ భద్రగుణోన్నిద్ర,
ప్రథనాంగణరుద్ర, కలితకౌస్తుభ హా, రశ్రీశేషా। చలశిఖరవి
హార, మోహనాకార। చెలినిచంచలను ని, శ్చలజ్ఞానమార్గము।
దెలియనెంతటిదానను, నీదానను। కలుఁగఁజేయుమునాకు నీపద,
నలినభక్తినిరంతరమ్ముగఁ। జెలఁగివందనశతములొనరిం, చెదను
దాశరథీదయానిధీ శరణు. 3

## 14. బేగడ-ఆదితాళము.

పల్లవి.—వినీలవేణి వినుతగుణశ్రేణి, వినవే శర్వాణి.

అనుపల్లవి.—ఘనాఘనాంగుఁడౌ రా, మునిచే ననుజ్ఞగొని గౌ
తమ। మునియొద్దకుఁజనె నహల్య, మునీంద్రుఁడా రామునిఁ
జూచి పలికె। ఘనంబుగను మిథి, లాపురంబునను, క్రతువరం
బుమా, హేశ్వరచాపము। కనుంగొనియనంతరం బయోధ్య
కుజనేవసఁ వినమ్రుఁ డయ్యెను హరి. వినీల.

రంగదభంగతరంగగంగను, ప్పొంగుచుదాఁటి విదేహ
రాజపురి। చెంగటరాగనెఱింగి జనకుఁడు చెలంగుచు నెదురు
గను। రంగుగఁజనిగాధేయునకునుసా, ష్టాంగ మెఱఁగిపూజించి
దిశలు వెలుఁ। గంగఁజేయుచంద్రసూర్యులొసుర, పుంగవులగు
నరనారాయణులో। శృంగారకళలబంగారుతళుకుల। నంగాను
దగినవీరలెవ్వ, రెఱుంగవలయునన దశరథాత్మజులు। మంగళ
కరులీరామలక్ష్మణులు మహాభుజుల్ ఘను లని ముని దెల్పెను.
వినీల. 1

శీవిగమత్క్రతుసంరక్షణమున,కై వీరలనే దోడితెచ్చి
నెడ । పావనుఁ డీరాఘవుఁ డొకశరమున, జావనేసె దాఁటక
ను । భూవర మదీయయాగవిఘాతకు, లై వరలుసుబాహుప్రము
ఖనిశిచ, రావళిఁద్రుంచియుమారీచుజలధిలో వైచెఁ బదాంబుజ
రజమునను, యీవీరుఁ డహల్యను వేవేగఁ బవిత్రను, గావించి
నేఁడు నీగృహంబునగరళకంఠువిల్లనుఁగొనవచ్చెను।నావుడు నగ
రికిఁదోడ్కొనిచని యానరేంద్రుఁడా రామునిబూజించెను.వినీల.

అంతట జనకుఁడు మంత్రులఁబిలిచి పు, రాంతకు విలుదె
మ్మనినభటులనత్యంతబలుల నైదువేలఁబంపినఁ, బంతముమీరఁ
జని।సంతతమును మణివస్త్రాదులచే, నెంతయుభూషితమై ఘం
టాశత । కాంతమైనవిలు దెచ్చినధరణీ, కాంతుఁడుకౌశికుఁగనుఁ
గొని యా, వింతన్నృపవరు లంతాజూడఁగ । సంతోషమునర
ఘూద్వహుండీ, చాపమెక్కిడినఁజాలును సీతా । కాంతనిత్తునన
విని శ్రీరాముని, కనుంగొనె న్మునిదరహాసమునను. వినీల. 3

శ్రీరాముఁడువామకరంబున వి, ల్లారయూఢిగఁగొనియెక్కి
డినృపతులు । చేరిచూడదక్షిణకరమునరు, దారదిగిచినపుడె।
పారముచెడిఫెళఫెళమనివిరిగెను, వైరివరులధైర్యముతోఁ గూ
డఁద । దారవము దిశల్నిండెదివివిమా, నారూఢు లగుచుగనుఁ
గొనుదేవత । లారాముని శ్రీమీరఁ బొగడిరి।తోరంబుగాఁ బ్ర
సూనవర్షము।దుందుభిధ్వనుల్పురవనితాజన, చారునాట్యములు
చెలఁగ రాఘవునిఁ, జనేశుఁ డర్మిలి గౌఁగిట నుంచెను. వినీల. 4

ఫుల్లాంబుజపత్రాక్షుఁడు రాముఁడు, విల్లువిఱచుటలు
వినియంతగపుర।పల్లవాధరులు మనసీతకు శ్రీ, వల్లభుఁ డనఁదగి
న । వల్లభుఁడిదెవచ్చెను చల్లనివాఁ, డెల్లజగములను నేలఁజా

లువాఁ । డల్లమరునై నజక్కఁదనమున నుల్లసంబులాడునటె యమ్మ । చెల్లా రామునివల్లాకోరిక । లెల్ల ఫలించు వంశపావనుఁ, డీమహాత్ముఁడంచనిపలికి సరస । సల్లాపములాడుచు సీత కుమణి, సరు ల్విరుల్ హారువుగ గ్గై సేసిరి. వినీల. 5

పట్టుచీరెగటిగట్టి రవికెచను, కట్టుదిట్టనుగ గట్టిమృగమదము, బొట్టునుదుట నునిచి కనులకాటుక, బెట్టి కురులుదువ్వి। చట్టముగా కీల్కుడివై చిమటిక్, మట్టుమీఱవేడుక చే సరవములు। జుట్టిస్వర్ణభూషణములు మేనను, దట్టముగాఁబూని యొక్కచెలి కేల్।బట్టి, జనకుని పటి, శౌరికి । పట్టంపురాణి నౌదునేనని, బాళితోడగుందనపు బొమ్మవలె । నెట్టనరాజమరాళ కరిగతుల, నెరానిరాకరింపుచు నడిచెను. వినీల. 6

తాటంకద్యుతి దిక్కులనెల్లను, దీటుకొనఁగఁ బాపట బొట్టునుసరి । సాటిలేనిచంద్రసూర్యులును స, య్యాటమునను మెఱయ । తేటపుముత్యపుసరులు పతకములు, మేటిచిలుకతాళి తోడబెనఁగొన । మాటికినందెలు ఘల్లని మ్రోయఁగ, దీటు లేని వైఖరిసీతావ।ధూటి, గుణముల పేటి, హారకి।రీటాదిభూషణాఢ్యు శేషగి,రీశు రామభూవిభునిచేరిమణి । హాటకమయ మాలిక గళముననిడి, హరిఁవరించితి ననిచనె ముదమున వినీల.

15. కాపి - జంపెతాళము.

పల్లవి — వినుహైమవతీఘనా, ఘనసుందరాకృతీ । వినుతధృతీ కరుణామతీ.

అనుపల్లవి — తనమంత్రులను బనిచె దశరథునితోడి తె । మ్మని జనకనృపతివేగా బాగా వినుము.

ఆరూఢిదివసత్రయమునవారలయోధ్యఁ, జేరి దశరథుని

గాంచి।ధీరులై మ్రొక్కి బహుదివ్యవస్తువులనరు,దారగాగాన్క
యుంచి।శ్రీరామునకుజయ శ్రీరమారామునకుసీతనినిశ్చయించి।
నేఁడుశ్రీ।మీారమిముబిలువనం,పెను జనకుఁ డన సంభ్ర, మించి
వేడుక దలంచి మించి. వినుము. 1

జనవిభుఁడు శ్రీరామ, చంద్రునకుగళ్యాణ, మనిచాటనా
నతిచ్చి । జనకమంత్రులకు నుత్సాహమునరత్నభూ,షణాదుకూ
లములునిచ్చి । తనగురుండగువసి, ష్ఠునిసుమంత్రునిఁగని రాం,
మునిపెండ్లివార్తదెచ్చి । తగుగదా, జనకవిభుబాంధవ్య, మనిన
కడులెస్సయని, రనువుగా ముదము హెచ్చిమెచ్చి. విను. 2

మరునాఁడుగురుహితస, మస్తజనులెల్లవే, మఱుబలసి
కొలువగాను, అరుదైనయాణిముత్యములగొడుగులనీడ, నధిక
వైభవముతోను । భరతశత్రుఘ్నులిరు, వురుగజారూఢులై,
యిరుగడలజేరిరాను । రథమెక్కి, నరవరుఁడు మిథిలా, నగర
మునకుఁ జనె నెలమి, నాల్గుపైనములలోను, తాను. విను. 3

హితమతిని దశరథున, కెదురుగాఁజనిపురో, హితసహి
తుఁడై జనకుఁడు । చతురుఁడై పూజింప, సరసులై రామల,క్ష్మ
ణులుతమతండ్రికపుడు । అతిభక్తిప్రణమిల్ల, నాలింగనమొనర్చె
నానందమునను నృపుఁడు । తతమహా, న్నత జనకరాజసద,
నమునసుతకౌశికా, న్వితుఁడై వసించెనతఁడు, జనహితుఁడు. విను.

తనయాగకర్మమం,తయుఁదీర్చి జనకుఁడుశ, తానందుతో
డననెను । దశరసంకాశ్యపుర,మునమదనుజుఁడుకుశ, ధ్వజుఁడుం
డుమోదమునను । మొనసిపిలనంపుమన, వినియట్లుసేయఁ జ,
య్యనవచ్చియతఁడన్నను । పొడగాంచి । తనకుమారికలు తా.

నునుమ్రొక్కి-వర్ధిల్లుఁ, డనుచునీ వెననుగొనెను, మనెను విను. 5
లలినిజనకుఁడు పురమ, లంకరింపుమనఁదో, రణచయో
ల్లాసితంబు । అలఘుసౌధధ్వజో, జ్వలము గోపురవితా, నావళీ
రాజితంబు । ఫలభారనమ్రరం,భాస్తంభశోభిత, ప్రతిగృహాప్రాం
గణంబు । కర్పూర । కలితాంబుపూరగం, ధిలరాజమార్గంబు,
కైసేసిరాపురంబు, డంబు. విను. 6
క్రమముతో నంతగప్పు, రమలంకరించిబం, గారుకుంభ
ములనుంచి । సమమైనపచ్చరా, జగతిపై నిలిపినీ, లములబోఁదె
లుఘటించి । రమణీయముగనుబగ, డములదూలములు వ, జ్ర
ములగోణిగెలురచించి । చతుర్ద్వా । రముల గోమరొప్పఁ గల్యా
ణవేదికగట్టి, రమరికనుసంతసించి, మేలెంచి. విను. 7
ఎలమిసీతాదికాం, తలకు నలుగులుపెట్టి, తలలంటిజలక
మూర్చి, జిలుగులనుదడియొత్తి, చెలఁగిసరిగంచుచీ, రెలుగట్టికు
రులుగూర్చి । వలనొప్పగొప్పకొ, ప్పూలుబెట్టిచందనం, బలఁది
తిలకములుదీర్చి । రవికలను । పొలయచను కట్టుపై, నలవరిచికై
సేయ, నలఁదిరసమముగఁజేర్చి । మదిచేర్చి. విను. 8
పరగకేకయపతికు, మారుఁడు యుధాజిత్తు, వచ్చెనచ్చ
టికినంత । వరుసదశరథుఁడు న, ల్వురసుతులభూషణా, వళుల
గైసేసిచెంత । సిసులలరఁజానుండు, తరిజనకుఁడానంద, భరితుఁ
డైభద్రదంతా, వళములను, గరిమునబనుపరా; ఘువులెక్కి
రాజమార్గమునఁ జూపట్టిరంత, వింత. విను. 9
పొదలుచును గౌసల్య, మొదలౌ సతులుగొల్వ, భూప
తులుజేరికొలువ ।విదితమాగధవంది, బృందములు గొలువ నటు,
విట గాయకులును గొలువ । సదయులు వసిష్ఠ వి, శ్వామిత్రు

లాశీర్వ, చనము లొసఁగుచును గొలువ । కల్యాణ । సదనమున
కరిగెశే, షగిరీశుఁడగు రామ, చంద్రుఁ డెదముదము మొలు
వ, చెలువ. విను, 10

## 16. కల్యాణి - ఆటతాళము.

పల్లవి — కల్యాణము వినవే, నేఁడు సీతా, కల్యాణము వినవే.
అను. — కల్యాణమయమైన, కల్యాణనిలయమున । కల్యాణప్ర
దుఁడౌయ, హల్యావరదుని. కల్యా.

వేదనాదములు వేణుమర్ద్దళవీ । ణాదుందుభి డిండిమాది
మహావాద్య । నాదములు పుణ్యాంగ, నాబృంద శుభగాన
నాదములుఁ జెలఁగఁగ, నకుఁ డెదుర్కొని దశర । థాది భూపతు
లక, స్థాసనమునిచి యా । మీఁద సపురోహితుఁ, డై దేవ ముఖు
హైామవేదిఁ బ్రతిష్ఠించి, వివిధమంత్రములచే, వేదోక్తహోమ,
విధులొనరించిసీ । తాదికన్యలధన్యలనల్వురను స । మ్మోదమున
రావించి,మురిఁయుచుశుభజాలా । పాదకముగమధు, పర్కమిచ్చి
వేడ్క, బ్రోదిజేసినృపుఁడు, పూజించె రాఘవుల కల్యా. 1

శ్రీమీర జనకుఁడు శృంగార వతిరై సౌ । దామినీలత
మాడ్కిఁ, దనరెడుసీతా । కోమలితెలుమలుఁ, గుసుంచిచా
లగా ,రాముని రామాభి, రాముఁడైన శ్రీరామచంద్రునిపాద,
రాజీవములుగడగి । నేమమున తజ్జలము, శిరమున ధరియించి ।
నీమముతో సీత, నిఖిలలోకమాత, గామితసిద్ధసం । కల్పపూర్వ
కముగ । భూమీశుఁడుధార, బోసె నగ్నిసాక్షి । గామానవతి
ని రా, ఘవుఁడు చేకొనె దేవ । తామందారసుమ,థారలు గురి
సెభ । ద్రామితగుణులై, యలరువధూవరులపై కల్యా. 2

అంతట దెరదీయ, నతివమోము జూచి । సంతసించెను,

రామచంద్రున కన్నవతార । కాంతుఁగనుఁగొనియలరు, కలువలపో
ల్కి నా । యింతిచూపులుదనరె హృదయేశుపదయుగళి । నెంత
యుఁదామరల, నెనయు తేఁటులనఁగా । కాంతామణిని పాణిగ్ర
హణ మొనరఁజేసి। కంతుజనకుఁడు మం, గళసూత్రముగట్టి। దంతి
గమనకుమణులు, తలంబ్రాలుపోసి శ్రీ । మంతుఁడై లాజహోమ
ము జేసి కృతకృత్యు । స్వాంతుఁడయ్యెను తాట, కాంతకుఁ డట
మీఁద । సంతతానందమున, జనకుఁ డూర్మిళ నిచ్చె, మంతు
కెక్కఁగాను లక్ష్మణకుమారునకు. కల్యా. 3

వరుసతోడనుకుశ, ధ్వజునికొమార్తెల । సురుచిరమాం
డవి, శ్రుతకీర్తులనిరువురను । భరత,శత్రుఘ్నులకునుజనకధరణీ
శుఁ డానంద । భరితుఁ డగుచు నొసఁగె నరుదారఁగాఁబెండ్లి ।
యలరారె నావేళఁ జిరతరయశులు, వశిష్ఠవిశ్వామిత్రు।లురువు
గనావధూవరులకుసేసలు । శిరమున నిడిరియా, శీర్వాదములు
జేసి । రిరవందదశరథా, ధీశుఁడుదీవించె । గరిమనుకౌసల్య,కైక
సుమిత్రాది । కరిగమనలు మం, గళహారతులొసంగిరా । తతి
రామలక్ష్మణభరతశత్రుఘ్నులకు. కల్యాణము. 4

జనకవిభుఁడుకౌశి, కుని వసిష్ఠునిఁ గనుఁ । గొనిపల్కె నార
ద,ముని యచటికొకనాఁడు । చనుదెంచినను వినుమనిపలికె హరి
భక్తజనవరదుఁడయి, నిర్జరులను బ్రోవ రా।వణువధియింప రఘు
వంశమునను రాముఁ । డను పేరదాశరథి, యై నాలుగంశముల ।
జననమొందెనుసీత, యనునామమున నీయిం।టను యోగమాయ
బుట్టెను దెలిసి కౌసల్య । తనయునకు సీతనిమ్మనిచనె నది మొదలు
గనుసీత శ్రీసతి, యనిదలఁచి యేవిధమున రాముఁ డల్లుఁడౌనని
చింతించి ధనువను నెపమునమీఁద, యనుశుభముగంటిన నే.క.

శ్రీరామచంద్రుని జేరి జనకుఁడుబలికె । శౌరీ నాజన్మము సాఫల్యమాయెను । దారసింహాసనస్థలిని సీతాయుతుఁడవై రంజిలనిన్ను జూడ నర్హుఁడనైతి రా । మారమణభువననిర్మాణనైపుణిగలిగె, నీరజభవునకు నీపాదవారిచే । నీరమ్యపదజలమునెరిదాల్చి బలిమహీపుఁడై సురరాజ్యవిభవము చేకొనె । సారమౌ నీపాదరజమున నహల్య, ఘోరశాపముదొలఁగె కోవిదులును నీయు । దారాంఘ్రిరేణువులు కోరిభవభయదూరులైరట్టినీవే శరణని పొగడెరాముని కల్యా. 6

సొరిదియాసమయమున, సురదుందుభులుమ్రోసె । ధిగుడుతద్ధిన్నాంతకిటతక, తా । థైథైయ్యయనుచు నచ్చరలాడిరి గంధర్వవరులుపాడిరి భూసురవరులధరణీ, వరులఁబూజచేసి । సరసమృష్టాన్నభోజనములిడి రికరణిపరగనాల్గునాళ్లు, జరుగుటయుఁగౌశికుఁ । డరిగె నల్లుండ్రకు, నరణమిచ్చినృపుఁడు కరుణచేఁ బుత్రికల ఘనమతులఁ గాంచి । త్వరతోడఁ బనుప నా, దశరథక్షితిపతివరసుతులుగోడండ్రసిరులలర నాశేష । గిరివాసుఁడైన రఘువరునిమున్నిడుకొని పురికి ప్రయాణోన్ముఖుఁడయ్యె ముదమున. కల్యా. 7

17. సురటిరాగము - ఆదితాళము.

పల్లవి.—చేరి వినవె శౌరిచరితము । గౌరి సుకుమారి గిరివరకుమారీ.

అనుపల్లవి —వారిజాక్షుఁడంతటను శ్రీ, మీఱివేడ్కతోనయోధ్యకుఁ । గోరిపోవుదారిలోనృపవైరియైనపరశురాముఁడు । కారుమొగులకరణి చాపధరుఁడై, కాలమృత్యువో యనఁగఁ

బంక్తిరథు । కేరిహారిమొదుటను నిలిచిపలికెను, వీరాధివీరుఁడని యెఱుంగక. చేరి.

బెండువంటివిల్లునడిమికి, రెండుజేసి పెల్లు, । పొందుకొం డనెనయఁజెల్లు, నావిలు, దండివైరులకుముల్లు, కడు।గండుమిగిలి దీనినెక్కుబెట్టిన, గాని రాముఁడ ననునిన్నునటుగా । కుండినఁ జంపుదు ననరాముఁడతనికో,దండముగొనిచక్కనెక్కిడియు, ఖం డాశుగము తగఁ దొడిగి తెగ,నిండదిగిచి భార్గవుఁడనిను। కాండా హతచరణుఁజేసిన్నృప, కాండాభిరాముఁడ వాదుననినఁ । బుం డరీకలోచనుండితండనిపూర్వకాలసంస్మృతిపొడమిపొగడి । భం డనప్రచండపండితుండవ, జాండాధిపతివవ్యయుఁడవనెను. చేరి.

బాల్యముననునేను, ఘోర, తపంబునేయుచోను, హరి వా । త్సల్యమొప్పఁగాను, వేగఁబ్ర, సన్నుఁడైపలికెదాను, సా । ఫల్యమయ్యె నీతపమునుజనస, మ్మానముఁజొచ్చి వంశయుతుఁడవగు సా, ఫల్యబలుఁడవగుచుఁ బితృహాసనుఁడగు, కార్తవీర్యగెలిచి ఖలనృపుల వై । కల్యాత్మకులజంపిశమదమ, ములాశ్రితుఁడవ గుము నేగొ,సల్యాగర్భమున రాముఁడవఁ, గల్యాణదాయినై జ నించియ । హల్యాసతిబవిత్రఁజేసిసీతను, గళ్యాణమైనీకు దరిశన ము, తుల్యముగనొసఁగుదునని జనిరెదయు, తోనాహరియనీవని చనిరెఁ, జేరి. 2

స్వామినేనుమించి, హేమాయు, వంశజులను ద్రుంచి శాం తుఁడ । నై ముదముదలంచి, చెలఁగెద, నీమహామహిమనుంచి, ఖగ।గామినీబలంబునీవుగొంటివి, గాననేనుధన్యతముఁడనైతిని, నీమహనీయదరిశనము గలిగెఁబి, తామహాదుల కగోచరుఁడవు శ్రీ, రామామనోహరుఁడవగు రఘు, రామా ప్రకృతికంటెపరుఁ

డవు। కామాద్యరివర్గదూరుఁడ వ, హేమాధవ భవరహితుం
డవు। కామకర్త గుణవర్జితుఁడవు నుద, కమున ఫేనజాలములు
ననలమున। ధూమమెటులనటులనేయఖిలమును, నీమాయచేఁ
గల్పితంబనె. చేరి.

ఎందాకనరుండమాయకు,హితవుమీఁరకుండు, వినువాఁ।
డందాఁక జడుండు, వానికినాత్మ గానరాకుండు, తనయందు గల్గు
నవిచారమునవిద్యమిగులఁ బ్రబలినదై విద్యనణఁచు। పొందుగా
నవిద్యాకృతముగుటను, బంధుబింబితుండై జీవాఖ్యను। బొందు
తనుమనగప్రాణములఁ బొందునపుడె స్వాభిమానము। నొందు
నపుడె సుఖదుఃఖముల, నొందునాత్మకుసంసృతిలే। దెందుజ్ఞాన
మిపుడుబుద్ధికినిలే, దిదినైజమువ్యాకృతమునఁబ్రకృతి। పొందు
గానుసంసారియయ్యెవాఁత, భుగ్వారిమేళనంపుక్రియననె. చేరి.

ఎంతదాకనరుఁడు, నీపద, హితులపొత్తుఁజొరఁడు, విను
వాఁ। డంతదాఁకకరుఁడువలెను భ, వాబ్ధిదిరుగుపామరుఁడు వే।
కాంతుఁడై సుజనసంగతివలనను, గనినభక్తిచేతనెపుడునన్న న।
నంతునాశ్రయించినపుడు, మాయకు, నంతమజితుఁడును స్వప్ర
కాశుఁడును। శాంతాత్మకుఁడునైనసద్గురుఁ, డంతవానికగపడు
ను సుని। తాంతానందమతనిచేఁ గని, చింతలతలనెల్లఁద్రుంచిని।
రంతరాత్మసుఖముఁ జెందునీపద, రాజీవయుగ భక్తిలేనినరు।
లంతమొందిజ్ఞానముక్తిసుఖముల, నందవశముఁగాక చెడుదురనె.
చేరి. 5

ఈశ శరణుశరణు, దురితవి, నాశ శరణుశరణు, సుజన।
క్లేశహరణ శరణూ, జయజయ శ్రీరామశరణుశరణు, నేఁ।
జేసి నట్టిపుణ్యమెల్లనీదుమ, హేశుగమునకొసఁగినాఁడనసుదయ।

జేసి బ్రోవుమనఁబరశురామునకు, సీతావిభుఁడు ప్రసన్నుఁడై పలి
కె। వాసిసీమనంబుననుదల, పోసివరముఁగోరుమనినుకృపఁ। జేసి
నాననినభృగుకులుఁడు, భాసిల్లుచు నీదుపదరజో। లేశమునకు
నేవరంబు సమమఖి, లేశభక్తినిమ్మనఁ గృతార్థునిఁగఁ। జేసి
పన్నుఁజనియె జామదగ్ని ని, జేచ్ఛం దనుజరిపు నుతించుచుఁ
జనె. చేరి. 6

ప్రీతుఁ డయ్యెఁజాలా, దశరథవిభుఁడంతటలీలా, గుణ
ముల। చేత నలరిశీలా, తగపురిఁజేరిచక్రియా వేళ, భూ। జాత
నెనసి తనరె నసుజులునునిజ,సతులరతుల నేలిరతులవిభవస, మే
తుఁడు జగత్ప్రభుఁడుఁ బ్రథితగుణ, జాతుఁడవ్యయానందమూ
ర్తిసం। గీతానంతకీర్తిసుగుణ, భూతాద్యఖిలసాక్షిమాయా।
జాతాఖిలకలుషహరుఁడు సా, కేతాధిపుఁడై యుండె హరిద।
యాతిశయత నిదియుఁ జెప్పె సుబ్ర, హ్మణ్యకవి శేషగిరీశుపేరవి।
ఖ్యాతిమీఱ నధ్యాత్మ రామాయ, ణాఖ్యానమున బాలకాండ
మిది. చేరి.

బాలకాండము సంపూర్ణము.

శ్రీ ర స్తు.

# శ్రీమదధ్యాత్మరామాయణకీర్తనలు.

## అయోధ్యాకాండము.

---

### 1. కర్ణాటకసారంగ - ఆదితాళము.

పల్లవి — శ్రీసద్గుణాన్వితా శీతాద్రిసుతవినవే। కౌశేయ, వాసుని శేషాచలవాసునిచరిత్రము.

అనుపల్లవి.— భాసిల్లునంతగిపురవరమునందు మణిసిం। హాసనస్థితుఁడై మునినుతుఁడై మహో। ల్లాసుఁడై దరహాసుఁడై శ్రీవాసుఁడై శ్రితదాసుఁడయినసీ। తాసహితుఁడగు రామునిఁగా గను తలఁపూనిసురమౌనివచ్చెను. శ్రీస.

శరదిందుచంద్రికాసదృశమౌ తనుద్యుతుల।, మెఱయుచువచ్చువాని నారదునిగా। నెఱిఁగి సీతాజానియు దేవీయుతుఁడయి। పొరపొచ్చమింతలేని భక్తిచేమ్రొక్కి। పరఁగఁబూజించిమౌని నీదర్శనసం। స్మరణచే విషయాసక్తచిత్తులమైనసం। సారచింతమాటికిఁ గలుగుమముబోటికి। దొరకదిదిదుర్లభము నినుగని పరమపావనుఁడనైతిని, భా। స్కరుఁడు రాఁ దమమడఁగుక్రియ నజ్ఞాన మడఁగునన ముని పల్కెను. శ్రీస. 1

శ్రీరామభ్రమయఁజేసెదవోననులోకాను। సారవాక్యములచేను సం। సారిననుటిదియరయసత్యమేనుజగదాదియౌమా। యారమణి గృహిణిగాను-జేయుటనునీసుతులైరి బ్రహ్మాదులెల్లను త్రిజగన్మహా సం। సారి నీవు హరి జనకజ లక్ష్మి

పురవైరి నీవుసీతహిమశైలజాత । వారిజభవుఁడవీవుధరణిజ -
వాణిరవివీవు ప్రభజానకి । యారూఢిస్త్రీపురుషవాక్యములన్ని
సీతయునీవనియెను. శ్రీస. 2

స్వామీనీఛాయ యవ్యాకృతమనఁబడునది । యేమూల
ప్రకృతిదానమహత్తత్త్వమామ మహత్తత్వానలింగశరీరమై ।
మఱియదిసకలమైనతనువులఁజేసె న । హంకారబుద్ధిప్రాణాజ్ఞాన
కర్మేంద్రియ। సాముదాయకములింగ, శరీరమనఁబడునదె జన్మ
కర్మమూలము ఇంద్రజాలము । ఆమహాత్మయెజీవ, సంజ్ఞనవా
ద్యవిద్యోపాధినొందిన । దైమించె స్థూలాదిదేహ, త్రయమె
జీవోపాధియనియును. శ్రీస. 3

స్థూలసూక్ష్మకారణాలజాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలు మూ
డుగల్గెనీసంసృతి । లీలచేనెనయువాఁడు జీవుఁడెపరమాత్మత్రి
కాలసాక్షి యీరేడులోకముల కాది । మూలమదినీవేచూడు
మాయాభువన । జాతములు నీయందె జననస్థితిలయములై
జరుగుచున్నవిరామా రాక్షసవిరామా । వ్యాళమనిత్రాడు
గనిబెదరిన, పోలికను దను జీవుఁడనుకొను బాలిశుఁడుఘనుఁ
డాత్మతానని భయరహితుఁడయి యలరుననియెను. శ్రీ స. 4

ఏనీతేజమునఁనీయఖిలమును వెలుఁగునిదిఖిలుఁడు తెలియ
లేక, దేహమేపలి యనియెంచు పుణ్యశ్లోకయెందాఁక న, జ్ఞానము
తెగిపోకయుండునందాఁక । దీనుఁడగుజనుఁడు నీకారుణ్యము
నవి।జ్ఞానానంద మొదవిననములుఁడౌనది నీపా, దారవిందభక్తిని
గలుగునదిముక్తిని । దానమగు రామనీదాసులదాసుఁడను కరుణ
నను బ్రోవుము । నీనాభికమలజుఁడు మాతండ్రి యటుగాననే
పౌత్రుఁడనని. శ్రీస. 5

అనిచాలా ప్రణతుఁడై యానంద బాష్పములు । కనుల
జడిగొనజడ దారి రఘువంశతిలకుని । వినుతించె వేడ్కఁజేరి రా
వణవధార్థము జనియించినావు శౌరి దశరథుఁడు నిన్ను । జనవి
భుని జేయఁగోరి, యున్నాఁడటుల । యిన రావణుఁడు జచ్చుటె
టులతనిఁజంపుదు । నని ప్రతిజ్ఞఁజేసినావు మును డాసి । వినుము
భూభారహరణమునకు, మొనయుమిదివనజభవు వాక్యము। ననినఁ
జిఱునగవు మొగమునజిగి, బెనఁగొనఁగననియె శ్రీరాముఁడు. శ్రీ.

వినునారద నే నెఱుఁగని దేమియును లేదు । మును ప్రతిన
నాచే, త నెటుజేయఁబడెనటు । లనేఁ జేతు సకలభూతముల, సు
ఖాసుఖములు । ఘనకాలసంజా, తములు ప్రారబ్ధ । మునసగు
నవిభువననే, తనై తగులక నే నే। నెనసివినోదింతునిదె రేపుదండ
కాటవి కేగి । మునివేషము దాల్చి సంతోషము । నను జతుర్దశ
వత్సరములుందును సీతయను నెపమునను రా। వణునిసబలముగఁ
జంపుదుననవిని దేవగతిఁ జనెమునీంద్రుడు. శ్రీస. 7

6. పూరికల్యాణి - ఆదితాళము.

పల్లవి—వినవే శుకవాణీ మాణిక్య, వీణా వాదనపటు వాణీ.

అను—మనువంశ్యుఁడు దశరథుఁడంతట మం । తనమునవసి
యిం, చివసిష్ఠుని ఘనముగ రావించిమన్నించి। వినుమనిపలికె
మహాత్మ నిఖిలజను । లును మాటికి వొగడెదరు శ్రీరాముని।
ఘనగుణాభిరాముని యువరాజును, గానొనర్పవలెనిపుడె భర
తుఁడను । జనిగూడిచనెను మామనుగనుఁ, గొన శుభదీక్ష
నునుపు రామునిరయముగననె. వినవే.

నరమౌని దశరథునివీడ్కొవి రఘువరునగరికి వేగ రాఁగా
శ్రీ। వారియెదురొకొని బాగా వసిష్ఠునిపరఁగసత్కృతులు గాఁగా

జేసి సీతా । తరుణిహైమకలశోదకములొసంగఁగ।గురునియడు
గులుగడిగి, శిరమునదవ్వారి । ధరియించినేమమడిగి,పూజించినీ ।
చరణనీరధారణ, మునఁగృతార్థుఁడనై । మెఱసితిననుదా, శరథి
పలుకువిని । చెఱునగవుదొలకఁగఁ బలికె మునునీ, చరణజలము
హరుఁడుశిరమునందిడి। పరమపురుషుఁడాయెమాతండ్రినలువయు
నీపదాంబువులసుఖయయ్యెననెను. వినవే.

ఇటులనఁదగు నేలోకగురుఁడవువి, శ్వేశుఁడవనియురమా
పతివనియు సము।త్కటయశుఁడవనియుఁ బరమాత్ముఁడవనియు
నిన్ను । కుటిలులకెఱుఁగవశ, మాభక్తపాలన । చటులుఁడవై
భూభా, రముమాన్ప రావణుని జంపఁగమదినెం, చిపుట్టితివనిదిటు
వున నిశ్చయిం, చినాను నేను । అటులైనబహుగోప్యము జేసితినీ,
వెటులమాయచే సర్వముఁజేయుదు। వటుల నేగురుఁడననిశిష్యుఁ-
డవీ,వనుచునటనసల్పితిస్వామిజగ। న్నటనసూత్రధారియఖిలభూ
తాం, తర్యామియనఁ వెలయుదువనెను దపసి వినవే. 2

నీవు శుద్ధసత్త్వమయమైన మేను నెరిఁబూనిభువియందు
మాయామనుజ । భావమునఁజెలఁగుచుం, దువకటరాజ । సేవ
గానిఁ జెం, దుపౌరోహిత్య । జీవనమతినిందితమని దెలిసియు ।
నీవురఘువంశమున జనియింతువని । భావించిసంతసముననీకు
గురుఁడనై । యేవేడుకకిదినే, నియ్యకొంటినాతపమిప్పుడు ఫలి
యిం, చెనన్నికనిమా । యావిభూతికగపఱుపకుదశరథ, భూమి
విభుఁడునిన్నుపట్టముగట్టె శు । భావహఁగమ్మనెను సీతతోదీ,
తావిధినుండుమని చనియె వసిష్ఠముని. వినవే. 3

శ్రీవిభుఁడులక్ష్మణునిగనినన్నుయువరాజ్యాభి, షిక్తుఁజేసె
దరునేనుసాక్షిమాత్రుఁడను । నీవెసకలముఁబూనుకర్తవు, భో

త్తవు, నీవే నా ప్రాణములు మేనుసుమ్మనిపలికెనా వేళ పౌరజనులు రామునియువరాజ్య । శ్రీవినికడు హెచ్చి దశ, రథుని మెచ్చి । యావార్త లపుడె దెచ్చి కౌసల్యా । దేవితోడసుమిత్రా దేవి తోఁ దెలుపవార । లావాక్యాకర్ణనమునసంతోషపూర్ణ । లై వెలసిరిసురలు, సరస్వతిఁగని, దేవి నీవయోధ్యకుఁజని విఘ్నము గావింపుము రామాభిషేకమున, నావిబుధప్రార్థనకియ్యకొనె వాణి. వినవే. 4

కొమరారుకైకనగరదాసియొకతె, కుంటిదీగూనిది గుజ్జు రూపు।దిమిడిగ్రుడ్లుముడిబొమలుడొంకుమైగల,ది యయోధ్య లోసురమణులకు, నవ్వులాటది మంథరయను । కుమతియొక్కతె గలదు భారతిదానిఁజెంది, కుదురైయుండెనంతగపురి శృంగార ముల । నమరియంతయువిం, తయైయున్నఁజూచి । భ్రమసిమం థర తొందర,రతోవచ్చి కైక రేపు । రామునకుపట్టాభిషేకముని నకైక । ప్రముద మొదవిబంగారందెలొసఁగఁగాప,డఁతియొల్లకిది భయసమయముసుఖ।సమయముగాదబలశేషశైల, స్వామియైన రామునిశుభము నీకనెను. వినవే, 5

### 3. తోడిరాగము - ఆటతాళము.

పల్లవి:—సరసగుణమణిసన్మందిర, సఖికృతేందిరా, వినవే.

అను:—గరిమమునరాఘవునియభిషే, కమహోత్సవము శుభ మనకభయా।కరమునుటయేమి శ్రీరాముఁడు, కౌసల్యగాననుఁ జూచునను। పరమసమ్మతములైన కైక, వచనములివ్వఁగఁజాల కమం, ధరనీసుతునకునీకుసుఖము, దలఁచినానుదాయఁగాను దలఁపకు సరస.

కైకవినుభరతశత్రుఘ్నుల, కేకయపురినికనిచినీకాంతుఁ।

డో కాంతయే కాంతమున సీ,తా కాంతుధరణీ కాంతుగాను । ప్రా
కశైశ్వర్యమున కెల్లను, పట్టభద్రునిఁ జేయఁదలఁచెను, నీకునీతన
యునకు దాస్యము, నియమించునొకయుపాయమున్నది, నీకు
రాజు దేవాసురాజినిచ్చి, నవరములు రెండుగలవు,నీకొడుకుదొర
తనము రాఘవుని, వనవాసమునునానసేయుమనె సరస. 1

ఈవిధమునమంధరపలికిన, హితవనితలఁచిసఖని మెచ్చు
చు । నావనితధీజనితకోపము, ననుమాసినచీరెగట్టి వెసను । శీవి
యుడిగి భూషణముల, న్నియుఁ బాఱవైచియలుకయింటి। లో
నొంటిగా నేలఁబడిపొర, లుచుండెనుదయగలవాఁడైన। పావనుం
డైన ధీరుఁడైన, దేవసముఁడైనఁ గానిసుజన । తావినోదమును
వీడఁడేని, తద్గుణానుసారియౌనునిజమిది సరస 2

అంతటనుదశరథుఁడుకైకగృ, హంబునకుఁజనినిశ్శబ్దమై ।
కాంతిచెడిభ్రాంతిపడిమెలఁగెడి, కలికితండముగనికలఁగివిభుఁడు ।
యింతవింతయి దేమి యనఁజెలు, లెఱుకమాకైకయలగినయది ।
సంతసముసేయుమనవినియా, దంతిగమనను డాసినీకీ । చింతయే
మిటికికైకనీదు, చిత్తమెటులటులఁజేతునని। తాంత మోహాము
ననుపా, దములకపుడునృపుఁడుమ్రొక్కిదక్కినాననె సరస. 3

పలికిబొంకనివారుమీరలు, ప్రాణేశమునుపునాకొసఁగిన।
యలఘువరములకు భరతునిరా, జ్యాధిపతిగారామునికానలో ।
వెలయఁ బదునాల్గేండ్లు మునియై, నిలువ సెలవీయుమనుచు
కైక । పలుకవినివజ్రహతవృక్షము, చెలువుననుభువిఁబడియంత
లోఁ । దెలిసిచెడుగుకలగంటిననుచుఁ, దలఁచివెడఁగుకలకంఠినె
దుట । పులివలెంగనితిరుగమూర్ఛిలిన, చెలులుబోధచేసి రాధ
రాధిపు సరస. 4

భార్యగావీవుశత్రువునా, పాలిటినీకురాముఁడుపరి । చ
ర్యయాశ్చర్యముగసల్పును, సతినీవు రాముని మెత్తువెపుఁడు।ఆర్య
సమ్మతునిబొమ్మనవే, నతివరాజ్యముగొమ్మని నృప । వర్యబొంకిన
నరకమునఁబడు, వాఁడవనికై కవలుకదశరథుఁడు, కార్యమే
మనుచు వనటనొంది, కందియుండెనా రాత్రిచనిన । సూర్యోద
యమునదౌర్యత్రిక,సుభగనాదశుభవినోదము లెసఁగె. సరస. 5

ఛత్రచామరతురగకరిరథ, సముదయముగనుపస్థిభూషి
త । గాత్రునిబవిత్రుని సుమిత్రా, పుత్రయుతునికరీంద్రారూఢు
ని । జైత్రాతపత్రాన్వితునిరాము, చంద్రుఁగనిజనులలరియుండిరి।
ధాత్రీశుఁడేమోరాఁడనియత్తఱి సుమంత్రుఁడు చనిమ్రొక్కి—హా।
పుత్రలలామ హారామ యని, పొగులు రాజుఁగని కైకనడుగ ।
రాత్రినిద్రలేదితనికి శ్రీ,రాము సుగుణధాముఁ దోడితెమ్మనె.
సరస. 6

దశరథాజ్ఞను సుమంత్రుఁడు జని,తగ రామవిభుదోడి
తెచ్చిన । శశివదనుఁ డసితతనుఁడగురఘు,సత్తముఁడు తండ్రికిఁ
బ్రణమిల్లెను । బిసరుహాక్షునిగౌఁగిలించుక, పృథివీశుఁ డేడ్వఁగ
వసిష్ఠుఁడు । మసలకనువచ్చె రాముఁడిదే, మనకైకభరతునకు
రాజ్యము । అసదృశాటవికినిన్ను బనుప, నడిగినాననిపితృవా
క్యము । విసువక నడపె దననె శేషగి, రిశిఖరాలయుఁడువిశాల
మతియై సరస. 7

4. ఆనందభైరవిరాగము - ఆటతాళము.

పల్లవి.—వినవేపల్లవమృదుచరణాకరుణా, వితరణగుణాభరణా.
అనుపల్లవి —జనవిభుఁడానతి, చ్చినదండకాటవికి । మునివేష
ధారివై, చనియెద నన విని, యనఘ రాఘవరాముఁడు

డనై యతివవలనను జిక్కితిని నిను । వనమునకుననిచి ప్రాణ
ము లీతనువునను మనవనెను భూపతి. విన.

రామాజగదభిరామా సుబాహువి, రామాకులల । లా
మాహా హైమవతీచింత్య, నామ హాభీమోద్దామసం । గ్రామ
హా శ్రీమహితముఖజిత, సోమా నిన్ను । నేమనిపొమ్మందు,
నెటులనోర్చియుందు । యీమోహాబ్ధికిఁగట్టు, ఏదని విలపింప,
నామహీపతినడలవలదని సౌమిత్రితోఁ దల్లినగరికి । ప్వామి చని
నతిసుమిత్రాకౌ, సల్యలకు సేయ దీవించిరి. విన. 1

అనువందవనభూమికరుగఁగార్యమువచ్చె, నమ్మాసెలవి
మ్మాయనిన । వినిసొమ్మసిల్లి యాకొమ్మహా, వనజాక్షు ననుఁజేర
రమ్మారాజు । నినుబొమ్మనుట నిజమ్మాన, మ్మ । నన నగుచు
కైక, తన నందనునిదొరనుగా । ననుపదునాల్గేండ్లు, వనమున
వసియింప । జనవిభునివేఁడెఁ బితృవాక్యమున, మనుపజనియెదనన
భరతునిక । వనియొసఁగి తనయునిచటనె నిలు, మనుచుఁ గౌసల్య
విలపించెను. విన. 2

కైకయెవ్వరుధరణి, కాంతుఁడెవరుచూడునా । ఘాకప
రాకాకైకనీకైకడిగిదివిజా, నీకములు । డీకొనినఁ ద్రుంతు
షో, నీకరాజ్యశ్రీకినిపట్టాభి । షేకమిపుడుప్రాకటముగఁ, జేతు
భరతుఁ డల్గినవతనినిఁ । గేకయులత్రుళ్లడఁ, గింతు ననిలక్ష్మ
ణుఁడు । పీకమైఁబల్కరాముఁడువిని, నీకడిమియును నీదు
భక్తియు । లోకములకెల్లఁదెలియునువ, త్సాకైకపై యలుగవ
లదనె. విన. 3

జడమునశ్వరముయీ, జగము రాజ్యముతనువు, సత్య
మాయిది, నిత్యమా ఆస, పడ భోగఫల, మానాత్మమా,

కలిమి । పడఁతిచంచలసుజన, స్తుత్యమాభ్రాంతి । యుడుగ కుండుటస, త్కృత్యమామాన । వుఁడసుఖమునకుకర్మ, మొడిగ ట్టితనకంటె । నొడలువేఱని తెలియ, నుడుగుకోర్కెలుతృణతతి। నడియేటఁగూడియడసిన క్రియ, మాతృపితృసతిసుతహితాదుల । నడకయిది స్వప్నసమమనియెన్నకజడుఁడుకోరునని రాముఁడు. వినవే. 4

ఆయువల్పముజరావ్యాధులు పులులవలె, డాయదెలిఁ యఁడాయునరుఁడు । ఈయఖిలసుఖములు, హేయమనడు। మా యురేఖగవన్మాయదేహ । మే యాత్మయనుకుమతి,ఛాయామా త్ర, మైయస్థిత్వోద్భేదోమ, జ్ఞాస్పృజ్ఞాంసని, కాయమా కాయమె, ట్లాయనాత్మ చెపుమా । యీాయాసవిడువుమహామికభ్రమ, హేతు విదియయవిద్యనేనన, పాయమగుసచ్చిదానంద, బ్రహ్మ మనుటిదివిద్యయనెహరి. వినవే. 5

మొదలు క్రోధము పాప, మునకు మనస్తాపమూలము ఇంద్రజాలముక్రోధము। సదయాత్ములకు ప్రతికూలము క్రోధము। హృదయగ్రంధికి నాలవాలముక్రోధము।విహితధర్మములకు, శూ లము, మదియం దదియుంచకనునినునీ, వఖిలసాక్షిగా నెంచి । ముదమునసుఖయింపుము యీాజ్ఞానము ! మదయుతులకీవలదు లక్ష్మణ, మర్మమనితల్లికీత త్త్వమె । సదయుఁడై తెలుపఁగొఁగిట సుతుఁ, గదియించిపోయిరమ్మనెసతి. విన. 6

హరిసుమిత్రకుమ్రొక్కియన్న లక్ష్మణనిలువు, మన్న మన సువెన్న।కరణికరుగఁ బల్కెనీకన్నమునునే । నరిగెదనను రానీ, కున్నఁజత్తు । పర మేశయనినఁ గడుఁజెన్నారంగ । కరుణించియను జారాకకు సమ్మతించియా । ధరణిజనుజేరినే, దండకాటవికేగి,

తిరిగివచ్చెద నిలువుమననీ, చరణములయాన నేనిలువను ।బరమా
త్మయనిన శేషాచల, పతియతివతోఁ గూడికదలెను. విన. 7

౬. యదుకులకాంభోజి - ఆదితాళము.

పల్లవి.—చికురనిందితాళీరణకేళీ, జితమదాసురాళీనిలయాకృతి।
సకలభువనపాలీలలనా, జనమౌళిశాలివినవే.

అనుపల్లవి—పకలరాజన్య రాజను భా । నుకులరత్నము వి
భవమునుడిగిజ । నకసుతాలక్ష్మణసమేతుఁడై, వికసితాంబుజ
లోచనుఁడై చను । టకుఁ గతమేమనితండ్రియాజ్ఞనడ, వికిఁ
బోవు చెటకేఁగి పురజనులుపొగల । నకటవగవకుండనుచువా
రితో, ననియె వామదేవుఁడన్మునీంద్రుఁడు. చికుర.

ఈరాముఁడు నారాయణదేవుఁడు, ఈశుఁడవ్యయుఁడు
మహానుభావుఁడు। శౌరియోగమాయసీతయయ్యెను, శౌరిశేషుఁ
డేలక్ష్మణుఁడై యలరెజను । లారా బ్రహ్మావిష్ణురుద్రా, కారమై
యూనిగుణశ్రీ । మీారజగదుదయస్థితిసం, హారములు జేయుచు
నుఁడు హరి । ఈరాముఁడు మత్స్యకూర్మసూకర, నారసింహ
వామన భృగురామశ । రీరములుదాల్చియిపుడుదశరథకు, మా
రుఁ డయ్యె ఖలులఁ జంపుటకుననె. చికుర. 1

రావణాదిదుర్జనులవధార్థము, రాముఁడుద్భవిల్లుట ఈ
యర్థము। దేవముని దెలిసిపలుకనతనితోఁ, దెల్పె రేపువని కేగెద
ననియితఁడు ధర ।జీవల్లభుఁడు గైకహరినట, వీవాసమునకనుప
లేదితఁ ।డే వారలనిటనియమించెను, దైవాధీనము సర్వజగము।
గావునమీారిందుకై యడలకుఁ,డీవనజో దరుహృదయపద్మమున।
భావించినఁజింత లేడలుననిముని, పలుకఁబౌరులలరి హరినుతించిరి.
చికుర. 2

ఆమీఁదట రాముఁడు కైకనగరి, కరిగియడవికేగమూఁకు
ముగురికి। భూమిపతియాజ్ఞఁ గొనుమనినఁ గైక, దీమసమున నిచ్చెనా
రచీరెలు, అవి।సౌమిత్రియు రాముఁడుగట్టిరి, భూమిసుత చేఁగా
కున్నను।స్వామి జనకజకటిఁ జుట్టెను, ఏమీయన లేక నృపభార్య।
లీమానవతికీచీరెతగదని। యేడ్వఁగ వసిష్ఠుఁడదరిపడి కైక।నీమది
చెడ సీత కదియొసఁగఁదగు, నేయని దుకూలములవనిజకొసఁగె. చి.

రాజుసుమంత్రునిచేఁ గుమారులకు, రథము దెప్పించనపు
డె జనకునకు। శ్రీజానిసలక్ష్మణుఁడై మ్రొక్కెను, సీతయందఱికి
మ్రొక్కియరద మెక్కె హరి, జేజే లలరఁగ తేరెక్కెను, జేజేయ
ని ప్రజలు వొగడనహో।తా జేయుఁడఖిలసాధనములు, తాఁ జేకొ
ని సుమిత్ర కొమరుఁడు। రాజిలురథమెక్కె సుమంత్రుఁడురథ,
రథ్యములనడుప నిలుమని దశరథ। రాజువిలపింపఁ దరమిసడచి
జన, రాజితోడఁ దమస దాఁటె రాముఁడు. చికుర. 4

పుడమితేఁ డవనిపైఁబడిపుర, పురఁబొక్కె పౌరలియేడ్వ
భృత్యు లధిపుని। యడరికౌసల్యనగరకిఁగొనిచని, రాయువతివిభు
నిబోధింపుచునుండె న।క్కడ రాముఁడు నిల్చి జనుల నిటు, విడ
రాదని పురికి రథముఁగొని।నడురాతిరి సుమంత్రుఁ బొమ్మని, యు
డురాజ నిభాననయునునను।జుఁడుఁగూడి నడువనపుడెకదలిచని,
సుమ। హృత్తరంగకలికలుషభంగ మృడ జటాజూటసంగగం
గఁగని మెచ్చుశౌరిఁ జేర గుహుఁడు వచ్చెను. చికుర. 5

చరణకమలయుగళికిఁ బ్రణమిల్లెడు, యొఱుకువానిరా
ముఁడు సుధఁజల్లెడు।గురుదయాదృష్టిఁ గని కౌఁగిట నిడు, కొ
న్నఁబొగడె గుహుఁడుభక్తినచ్యుతుని। హరిధరియించె జటలు
మునినై వనిఁ జరియింతు ననుచు లక్ష్మణుఁడును। ధరియించెను.

సత్యవ్రతుఁడని కురియించిరివిరులుసురలు శ్రీ।ధరుఁడు గంగనీటఁ గ్రుంకి జలములు ద్రావితరుమూలమునఁ బవ్వళించెఁ। దరుణి తోడ నట రామచంద్రునా, గరులుగాన లేక పురికిఁబోయిరి.

మాయామానుష వేషధారి తృణశాయియై నిదుర వో
వఁగ ధనుస్సాయకములుబూని గొలిచియుండెడు, సౌమిత్రితో
నిషాదవిభుఁడు పలికెఁ దృణ। శాయి శ్రీహరినిటుగనికను, దో
యిసంతోషింపకున్న। దోయి ఈదుఃఖమునకు కయి, కేయి హే
తువుగదాయనెను। మాయికముసుఖాసుఖమునొడలుతమ, కే
యొడ లేదని లక్ష్మణుఁడు శర। నాయకునకుఁ దెల్పఁగ నరుణోద
య, మాయె శేషగిరిపతియు మేల్కొనెను. చికుర. 7

6. భూపాలము - అటతాళము.

పల్లవి:—సఖిమణి వినవే నీ వీ సచ్చరితము సలలితానం, దదా యకమనవే.

అను—సుఖాజడశుభసుషుప్తిదేరి, ముఖాబ్జకాంతి పొదలర ఘుకుల। శిఖామణిగుహాసీతానుజుల్, సేవింప స్నాతుఁడై సుప్రీతుఁడైలస। దఖండమగు యోండ నెక్కి యము, రాపగ గడచిగువానిబిలిచి। సఖాపురికిఁబొమ్మనుచుఁబనిచె, సదయుఁ డై ప్రయత్నపూర్వముగ. సఖి.

మించిరాఘవులు మృగమునొకటి వధించిపచనముమం చిగాఁగా। వించిముగురుభుజించియచటవసించి మేల్ కాంచి, మ రునాఁ। డంచితగతిధరాత్మజతాను, దంచద్భరద్వాజాశ్రమము, గాంచిమునికితమ, వేంచేయు డెఱిఁగించఁగాఁ, బంచి హర్షించి రమ్మునిశిష్యు చేనృప, పంచాననులు వచ్చుటదెలిసి, చంచదర్ఘ్య ముగొంచెదురు చని, చక్రి సీతుంచితనువపుల, కించనుతియించ

మునికనఘులు నమస్కరించకౌఁగలించి రామునిపూ । జించెను
శ్రీరామునిస్మితముఖ జితసోమునిజగదభిరాముని. సఖి. 1

నాదబిందుకళాతీతజగ । దాదిపురుషమహాత్మ వినునీ। పా
దరజమునఁ బ్రోదిసేయుము, నాదుమందిరము అనినముని । నాద
రించితదాశ్రమమునవి, నోదించితదనుజ్ఞ సుజనా । ప్లాఁచి వాల్మీ
కాశ్రమము శ్రుతి, నాదబంధురముగనిముని। పాదములకునవని
జానుజుల, తోఁదవిలి ప్రణతుఁడై యలరు మ।హాదేవునిసుమా
స్త్రరుచిరుని, నబ్జదళనేత్రు రమాకళత్రునిశ్రిత । మేదినీసుతా
లక్ష్మణు లావాల్మీకిఁగాంచిగౌరవించిపా । ద్యాదివిధుల నర్చించి
ఫలము లర్పించి భజించిహరి పలికె సఖి. 2

స్వామివినువనభూమిదశరథ, భూమివిభు పంపునఁ జరిం
పఁగ । మేమువచ్చుటమీకుఁ దెలియని, దేమియున్నది నేను యా
మానవతి । తోమెలఁగియిచట శ్రీమించునది, నేమింపుమని రా
ముఁడుపలుక । నామౌనియఖిలార్థసంవేదియై ప్రేమచేఁ బల్కె
భువనమునకు । శామనీవే నిలయ మవినీకు ధామమిది సాధారణ
మనుత్తమమైన దే।వామహానుభావావిను మేమహాత్ములతి శాం
తులు సముల్లిచ్ఛాసూయావిరహితులునీ । శేముషిగలవారి మది
నీకు శ్రీయుతముగనిలనునికి యనెను. సఖి. 3

శమదమదయాసత్యములుగల, సుమతులెవ్వరుశుభాశుభ
ముల । సమయములహర్షవిషాదముల, భ్రమయరెవ్వరుసుజన
బృం । దములఁగూడి ధర్మాధర్మసమరసమువీడి మది నినుశరణము
వేఁడి గర్వముదిగనాడిమమతగోరాడియొప । రమునులయితన
రారుదురయొప రమితధృతిశ్రీరామనీమం । త్రము జపింతురు
ద్వంద్వరహితులయి, తజ్జనులస్వాం । తముని శాంతము నీకుమ।ద్వి

మతపడూర్మిషడ్భావములకుమీఱి యవలవెలుఁగునినుదే। హ
ముగసర్వగతునిగనొకనిగ, నరయుజనులమదియిలునీకనె. సఖి.

అనవరతయోగా, భ్యాసబలమునదృఢీకృత। మనస్కులు
నిను ప్రతినిమిషమును, గనుఁగొనుచునఘులయిమించు । ఘ
నులహృద్వనజమునసీతాయుతుఁడవయి, మొనసినవిహారింపుమ
దియనీకు । ననువైనతావునినువర్ణింపఁజాల, నంచుఁబలికివనజాక్ష
నీప్రభావముచే, ననువంద బ్రహ్మఋషినయితిని । జనమాత్రమే
త్మకుఁడనుని, పాదపురిఁబెరిగివిలుబట్టనెఱఁగి బో।యనెలత
నొకతెనెనసికొడుకులఁ, గనినేవారి బ్రోవజీవుల। మునుమిడియ
మునివలెనెజంపుచు, ముచ్చులతేఁడన నెగడితి సనె. సఖి. 5

ఈగతిచరియింపసప్తఋషు, లాగమవేత్తలరుగవారల।
సాఁగిపోనీకాఁపిననిరి, వేగనీవరిగి నీసుతుల।నీగరితలను నెమ్మిఁ
బిలిచి, భోగఫలముల పోల్కిదురితము। భాగములుగొమ్మనివారి,
నాగరికమెఱఁగిరామా। తోగర్వమెందుకనఁజనినే, నాగరితనడు
గనాలుబిడ్డలు। మూఁగియడచినమొఱకునయిమరలి, యోగివరు
లనుగనియదిదెలుపవినికడు । రాగిలియుపదేశమిచ్చి వారవలఁ
జనము, రామరాయనివి । రాగినై జపించితిపుట్టలు, ప్రబలెనాదు
తనువుననెముని. సఖి. 6

అంతటబహుసహస్రాబ్దములు, పంతమునను దపంబుసే
యఁగ । దాంతులగుసప్తఋషులువచ్చి, దనరననుఁదెలుపభానుఁ
డు । మంతుమీఱఁదమమునడఁచుక్రియ, వింతగావల్మీకము వెడ
లి । సంతసముననుసంయములఁగని, సద్భక్తిసలుపధీ। మంతుఁడవు
బ్రహ్మఋషివైతివి, వంతదీఱెనువాల్మీకి యని । యంతర్హితులై
రింతయునుశేషాద్రిశనినుమదినుతియించుఫలమిదియని । కొంత

పొగడిసురనదికిచిత్ర, కూటగిరికి నడుమగృహము ముని । కాంతుఁడురచింప సీతా, లక్ష్మణయుతుఁడై హరియుండెనచట. సఖి.

7. అసావేరిరాగము - ఆదితాళము.

పల్లవి — హృద్వనజార్చితరామాయా, శ్రితజనకల్పారామా
సద్వచోభిరామా రామా వినవే.

అను. — ఆద్వయముగసుమంత్రుఁడరదముఁగొని, యయోధ్య
కరిగి,దశరథునకెఱిఁగిర । ఘూద్వహుఁడు జానకీ లక్ష్మణులను,
గూడి గంగకావలజనన్నృపుఁడు । విద్వన్నుత రామచంద్ర
సీతా, విభో జగత్ప్రభో విధాతనినుమ । హాద్వైభవానుభవ
యోగ్యనడవి, నడలవ్రాసెనాయని యడలెను. హృద్వ.

పుడమిజనులునినుదయగలవాఁడని, పొగడగవైకల్యమేటికి । అడరినీదుకోరికలన్నియునే, డకటా సాఫల్యమాయెను । వెడవెడయేద్వికయుడుగుమనుచు నృ,ర్వీశునిఁ గౌసల్యదూరిన । నిడుదకన్నులనీరోడియునతనికా, నుడియొహృదయశల్యమాయెను । పిడుగుబడినవానికొఱవిఁజూడిన, వడువుననేఁచెదుప్రాణముల్నిలవు, పడఁతివినుము పుత్రశోకమునదనువు, వెడలుననుచు నొకమునితిట్టెఁదొల్లి । కడకనేనువని వేఁటలాడముని, కొడుకొకఁడు రేయినది ఘటముముంచ । బుడబుడమన గజమనిశరమేయ న, తఁడు హాయతి ననె జనపతి. హృద్వ. 1

డాయఁజనియయోయని నేమునిపద,తో యజములుదడవిరోముని । నాయక నేనపరాధిని దశరథ, నరపతిననినుడివి మ్రొక్కిన । సాయకవేదనకోర్వలేనునా, జననీజనకు లడవినొరలెద। రాయెడకేగుమువైశ్యుఁడననినశ । రమ్ము బెరకినిడివిసేయక। తోయముఁగొని చని హాకుమారకా, హాయఙ్ఞదత్తాయని జీరు

వారి। కాయతమతివలగొనియుదక మొసఁగి యయో, ధ్యావిభుఁ
డను దశరథుఁడ దంతి । నేయమిాతనయుఁ డీర్ఘైనన నీవు, మా
యటులనెసుతునెడసినపుడెచని । పోయెదవసిగెడసిరని దెలిపిమ్మృ
తుఁ, డాయెహారిహారీ యనుచున్నపుఁడు. హృద్వా. 2

మోహముకొని యహాయనికౌస, ల్యాదిముదితలువిలపింపవ
సిష్ఠుఁ। డాదయితలవారించి శవము, తైలముచేఁ గ్రాఁగింపఁ
బంచటు। మీఁదభరతశత్రుఘ్నులఁబిలవనం, పినత్వరదీపింపవా
రే। డోదినమేవచ్చియయోధ్యఁగనిభయ, ఖేదములుజనింపఁ
బురజను। లాదరింపమియుగని యిదేమోయని, యంతిపురికేగి
కైకకుమ్రొక్కిన । మోదమొదవిసుతుఁ గౌఁగిలించితన, పుట్టి
నింటిసేమమరసెభరతుఁడు । మేదినీశుఁడేడనికైకనడుగ విని
సీతారామలక్ష్మణుల నీ। మీఁదిదయచేనడవికనిచితి, మృత్యుఁ
డాయెనాసొలసె నతఁడు. హృద్వా. 3

కొంతవడికి నేదదేరభరతుడు, కోపదృష్టినిజూచికైక
శాంతమూర్తిని గృపాళుని శ్రీరాము, చంద్రు నడవిఁద్రోచి భువి
పతి। హాంతవైతి పయయో నరకము, నందుపడెదవే ఛీయనినే।
నెంతపాపకర్మికి కొడుకైతి, నింకేలననుచు లేచిపోయి। కాంతు
బాసి వనరెడుకౌసల్యను, గాంచి పాదములపైఁబడి యేడ్చెన।
చింతయేమిా నీవు కైకకరుణను, శ్రీమంతుఁడవైతని జననిపలుక।
యింతకైకకృత మే నెఱఁగినగురు, హింసజేసినట్లనఁ గౌసల్యా।
కాంతతనయుఁ గౌఁగిటనిడికొని యా, క్రందించెమహారవమొసఁ
గఁగ. హృద్వా. 4

అపుడు వసిష్ఠుఁడువచ్చి భరతుతో, ననియె వగచుటేలా
దశరథుఁ। డపరిమితసుఖము లనుభవించిదివి, కరిగె జ్ఞానశీల

జీవుఁడు । చపలజన్మమృత్యురహితుఁ డమలుఁడు, శాశ్వతుఁడు
త్రికాలాబాధ్యుఁడు । కపటశరీర మెఁజడ మనృతమిందు, కైవికార
మేలామూఢుఁడు । అపవిత్రమైన సంసారదుఃఖాహతులై బాం
ధవులు దెగిరనిపోఁగలు । నిపుణుఁడుజీవితముచిగురాకుకొన,నీర
బిందువునుగాఁదలఁచుననుచు । కృపచే నెఱిఁగింప నృపునితను
వ,గ్నిచే దహించిక్రియల్ జేసి పోద । రపురస్సరుఁడై భరతుఁడు
శేషగి, రిపతిరామునిఁ జూడఁదలఁచె. హృద్య. 5

8. మంగళకౌశికరాగము - అటతాళము.

పల్లవి —ఎలమిచేసేవింపవే, శ్రీరాముని । చెలిమిచేభావింపవే ।
యోలలనా.

అను —పలలితముగరామ, చంద్రునిశ్రీపాద । జలరుహానిష్యం
ద, సద్భక్తిమకరంద. మెలమి.

భరతుఁడామీఁదటబంధుమిత్రమంత్రి । వరసేనాపరివృ
తుఁడై కోసల । పురికి హారినిదేనుద్యుక్తుఁడైవసిష్ఠాది, గురుసజ్జ
నాన్వితుఁడై కదలిగంగా । సరిదమలపులినాం, తరములవిడిసె
నచ్చెరువంది గుహుఁడుచె, చ్చెరశరశరాసన । ధరుఁడై యోధుల
తోఁడ, దరమినడిచియితేఁడు । పరమపావనుఁడేని, సురనదిదాటిం
తు, హారికివంచకుఁడేని, యరుగనీననివచ్చి । భరతురామసే
వా, నిరతురాజ్యకాంక్షా, విరతుఁగనిమెచ్చియ, ర్పించె కానుక
లుమ్రొక్కి. ఎలమి.

కూరిమిభరతుఁడు, గుహునిమహామహుని । సారెఁగౌఁ
గిటనుంచియచ్యుతు చెంత । జేరినట్టాత్మనెంచియచ్చటనీవు, శౌ
రినిఁ బొడగాంచినావని యతని । చే రాముఁడు విశ్రమించియు
న్నచోటారసి తిలకించిమ్రొక్కియచట । నారాత్రియుండిమఱు

నాఁడుప్రొద్దునభా, గీరథిదాఁటియరుదార భరద్వాజ । శ్రీరమ్య
చరణ రాజీవములువలగొని, యారూఢి తావచ్చుటంతయుఁ దెలిపి
స । త్కారములతనిచేఁ, గాంచినాడచట శ్రీ । మీరనిల్చిముని
చేదారిదెలిసివేగ, శ్రీరాముఁడుండెడి చిత్రకూటముజేరె. ఎల.

బలములభరతుఁడి, మ్ములనునిచిగుహాశత్రు । ఘ్నులు
రానడచితనమై, పులకలునిండఁ । దిలకించె మునిధనమై, ఫల
కుసుమకు । ట్మలపాళికాఘనమై, శాఖశాఖా । విలసద్ఘనాఘ
నమై, మయూరకో।కిలకీరసేవనమై, పావనమైశ్రీ యలరునావన
ముపరిహాసి, తానందనమచటఁహాల । కులిశధ్వజనీలాబ్జరే, ఖల
చాలు బొలుపొందుసీతారాములపాదముద్రిత । స్థలులుగని
హర్షాశ్రుజలముకన్నులజార, ఫలియించె నాదుకోర్కెలు నేధ
న్యుఁడనై ।వెలసితి నని యెంచి వినుతించిహరియున్న।నిలయము
శుభలక్ష్మి, వలయముఁజూచెను. నెలమి.

వెలిదమ్మిరేకుల గెలుచుకన్నులవాని, వెడదయురము వాని
నల్లనివాని । మొలకనవ్వులవాని సీతాలక్ష్మి, ఇలతోఁ గ్రీడిం
చువాని నారచీ । రలజడల దనరువాని నీరేడుజగ, ముల నేలిన
వానిరామునిఁ జూచి । సలలితభయభక్తి, సంభ్రమాద్భుతము
ల । వలగొనితత్పాదనలినములపై హస్త । ములుజేర్చి సా
ష్టాంగముఁగమ్రొక్కికనులనం । గుళములొత్తుచు మేలు, దలఁ
చుభరతునికృపా । కలితదృష్టిగాంచి కౌఁగిలించితోడలనెలకొ
న్నెగుహాశత్రు । ఘ్నులునతులొనర్పఁగ లలితుండుదీవించి వెల
లేక్షిచనువిచ్చె. నెలమి. 4

స్వామికౌసల్యాది జననులురామ్రొక్కి, వసిష్ఠముని
గాంచిపూజజేసి । భూమీశునెచ్చరించి సేమమడుగ, నీమీఁది

మమతమించి దశరథుఁడు ని । న్నే మదిలోనుంచి దివికరిగెనన,
వేమారు శోకించి గంగానదికి । రామ లందఱు వెంట రా నరిగి
స్నాతుఁడై । శ్రేమఁదిలోదక క్రియలుదశరథునకు । సౌమిత్రియు
నుదాను, సల్పికృతకృత్యుఁడై । నేమముననాదినము, నెర వేర్చి
మరలి నిజ । ధామము జేరిస, త్ఫలములందఱికొసఁగి । శ్రీమీర
మన్నించె శేషగిరిప్రభుఁడౌ శ్రీమహిళావిభుఁడీ, లీలవినోదించె.
నెలమి. 5

## 9. జుజావంతి - ఆదితాళము.

పల్లవి.—వినవేవళదరవిందదళసుందర । విశాలలోచననిజకింకర
జనభయమోచన.

అను—రఘుకులతిలకఅయోధ్యకురమ్ము తు, మాపతివై మమ్ము
బ్రోవుము । ఘనయాగములజేసి సుతుల గాంచి । తనయులరా
జ్యము,న నునిచి పిమ్మట । వనమునకేగుట రాజధర్మ మిటు,
వలెజేయుముకైకదురితమతియై । యొనరించినయపరాధము
క్షమింపు, మని భరతుఁడన్న పాదములకు మ్రొక్కెను. వినవే.

భరతునిరాముఁడు తొడపైనిడుకొని, పరగబుజ్జగించి
దశరథ । నరనాథుఁడు నన్నరణ్యమునపదు, నాల్గేండ్లు వసించి
మీఁదట । పురముఁ జేరుమనెనంతదనుకనిను, ధరణిఁగావఁగఁ
బంచినాఁడిది । యిరుపురమును నెఱపవలెననిభరతుఁ, డిందిరే
శుఁగాంచి జనకుఁడు । కరటికాముకుఁడు భ్రాంతుఁడతని వాక్య
మనృతమన వత్సా దశరథుఁ । డరయ సత్యవాదియతనిమారకు
మనినసామిమునినై నేవనమున । జరియింతు నీవుధరయేలుము
నుడు, హరి య దేటితగవటంచననేనునీ । చరణముల్ గొలిచి
వత్తుననిదాశరథి వలదయోధ్యకుఁబొమ్మనెదమ్ముని. వినవే. 1

శ్రీయొల్లనయోధ్యయొల్లఁదనువృత్య, జింతుననుచు లేచి
భరతుఁడు । ప్రాయోపవేశమునకై కుశభూ, శాయియైనఁ జూచి
రాముఁడు । మాయురేచనికులగురునికనుసైగఁ, జేయనతం డేచి
భరతుని । డాయఁబోయినావాక్యముసతండ్రి, మాయలుబోదో
చివినునా । రాయణుఁడచ్యుతుఁడీరాముఁడు, బ్రహ్మచేతఁ బ్రార్థి
తుఁడై రఘుకుల । తోయధిఁబుట్టెనురావణాదులను, దునిమి
వచ్చునన నతఁ డద్భుతముగ । శ్రీయుతునకునతుఁడై పాదుకల,
ర్థించ రాముఁడొసఁగ మౌళినిడికొని । తోయజాక్షుసమయాతీత
మైన, నేయనలముఁ జొచ్చువాఁడన నెభరతుఁడు. వినవే. 2

కైకసాశ్రుజలనయనయై శౌరి, గని ముంతనమందు రా
మా । నీకపరాధముఁ జేసితిఖలనై, నిందఁబడితి నెందునను
దయ । చేకరుణింపుము నీమహామహిమ, శ్రీనివాసముందు
ఎఱుఁగగుణాకరుఁడవగుణుఁడవు విష్ణుఁడవ,వ్యయుఁడవు నీయం
దులోకా । నీకముఁల్ నీదుమాయ చేజనన,నిలయవిలయములను
జెందును । నీకన్యము లేదుఇంద్రజాలిక, ని తెఱఁగునమాయా
మనుజతనువు । చేకొనినటియింతు నీవునీచే, లోకులుప్రేరితులై
చరింతురు ది । వౌకసకార్యమొనర్చితినీమా, యాకళామోహి
తాత్మనై నేనునని. విన. 3

పాహిపాహి దేవ దేవనమోస్తు, పద్మనాభ సీతానాయ
క । మోహమునెడిముడివిడుమనిజనని, బొగడనత భ్రాతావనుఁ
డగు । శ్రీహరిచిరునగవుదొలుకఁబలికెను, చెలఁగిధీసమేతనిజ
మేయు । దాహరించితివినిర్జరకార్యార్థము నేసీచేతనిటుల ।
వ్యాహృతముగ బలికించితి నీకు భ, వము లేదదె నన్ను దలఁ
పుము । ద్రోహస్నేహములు లే ఇతని కని దు, ష్టులు ననుదె

లియలే రనిన ఖగ । వాహనునకు మ్రొక్కి కైకవీడ్కొని, వ
రసేనాయుతుఁడై భరతుఁడు జని । మోహానముగ నంది గ్రామము
నను, బాహుకంఠలుంతనునిదలఁచుచుండెను. విన. 4

కుండలిశయానుఁ డిచట జనసం, కులమని భూమిసుతాల
క్ష్మణు । లండదండలనునడువ దండకార, ణ్యముఁజొచ్చి శ్రితా
శ్రితుఁడై । యుండెడియత్రిమునికి మ్రొక్కిన నతఁ, డొసఁగెన
ర్ఘ్యము జితాహితునక । ఖండభక్తి ననసూయకు జానకి, దండ
మిడ నభిమతార్థసిద్ధి । దండిగ నగునని దీవించియిచ్చెఁ, గుండల
యుగ మవనీతనయకు । మెండుగ జతుర్దశాబ్దములకు కా, క్షీర
చందనాద్యలంకారములు । నిండుమనంబున నొసఁగెననసూయ,
నృపలలాముఁడగు రాముఁ డత్రిముని । మండలాఖండలుని
తోడఁ దత్త్వ-మహితగోష్ఠినుండె నమరసన్నుతుఁడై, విన. 5

భాషాపతినుతుఁడగు శ్రీరాముని, భయభక్తులుమీఱఁజే
రియ। శేషభువనములుసృజించియవి, పోషించుటకును దా రాకృ
తులను । వేషధారివలెఁబూనెదవునీవు, రోషదూరా రామాయా।
యోషామణి యఖిలము భ్రమించునది, యొదుగునీకు వీరాధి
వీరా।దోషాచరహరహరచాపదళన, పోషితముని సవనాయవని
కడు।భూషించె లక్ష్మణుఁడునాచేని, వ్ముగబలుకఁబడిన యీచరిత
మాంధ్ర । భాషనధ్యాత్మ రామాయణమున, బరఁగ నయో
ధ్యాకాండమురచించె । శేషాచలపతిపేరనతనికృప, చేసుబ్ర
హ్మణ్యకవీంద్రుఁడు ముదమున. విన. 6

అయోధ్యాకాండము - సంపూర్ణము.

శ్రీ ర స్తు.

# శ్రీమదధ్యాత్మరామాయణకీర్తనలు

## అరణ్యకాండము.

### 1. దేవగాంధారిరాగము - ఆదితాళము.

పల్లవి.—శ్రీశేషాచలవాసునివినుతి - సేయనెవరికినైనఁదరమా, ఉమా.

అను.—శ్రీశుఁ డత్రిమునిచేదారెజేఁగిది, నేశోదయకాలమున గదల సీతాసుమిత్రసుతులతో మదవే, దండపుండరీకానీ కచమ । రీశశవరాహామహిషశరభకపి, వృకాదిమృగభయ దమైఖగకులా। వాసమైప్రచండమౌదండకా, వనముజొచ్చి యజానితో ననియెను. శ్రీశేషా.

మనుజాశనకంటకావృతంబీ, వనమునమతిప్రయత్న ముగబో।జనుచుఖేటముల్గొనుచు, జనకజముందఱవెనుకరాము లక్ష్మణులిరువురు జనికనిరి యసురనా, ఘనిమానిఖగవ్యాధుని విరాధుని । ఘనశూలము ద్రిప్పుచువాఁడువచ్చి, కట్టలుకఁ మీరెవరని యడిగిన। విను రాఘవులముదశరథవిభుసను, పున సుజనులఁ బ్రోవఖలులజీవ । ధనము గొనివచ్చితిమనబ్రతికెడి, తలంపుగలిగినలలననొసఁగి, చనుఁ । డనికదియుమహాసిచేరా ముఁడాదనుజ కరచరణశిరములువరుసనరకె. శ్రీశేషా. 1

శ్రీరామునిగౌఁగిటజేర్చెసీత, చెలఁగెదుందుభిరవమువి రులుగురిసెఁ। దోరముగాఁగడుశృంగారముగా। సారెకునచ్చర

లాడిరిపాడిరి । చేరి కిన్నరుల్విరాధుజంపుట, చేరాజిలిరరికరిహరి
యైనహరి । చారుభూషణద్యుతి నసమధృతిను, దారశుభాకృతి
నమలాంబరభృతి । తారాపథమధ్యగుఁడగుకవిగతి, దనరుచక్ర
ధరునిశౌరినిగని । కోరికదీఱవినమ్రుఁడై మ్రొక్కి, గుణాఢ్య
విద్యాధరుండ దుర్వాసుభూరిశాపమున నసురనైతినిదె, ముక్తి
నీవలననగు టనెవిరాధుఁడు. శ్రీ. 2

భవరోగవైద్యదయాకరనమో, ధవళాంబుజాక్షునినుద
లఁచుచుగను । చువినుచునుడువుచునంటుచును, నవిరళముగ
మ్రొక్కుచునుండఁగ, నే । యవలెనాయనో నేత్రశ్రోత్రజిహ్వా
కరశిరములురామతారకనామ, భవనుతయని బలుకవారి, నగు
చునాభక్తిదుర్లభంబదినీకుఁగల్గెఁ । బ్రవిమలసుజ్ఞానివై తివనవిని,
ప్రకటసుగుణభద్రా రామభద్రా । ఎవరునీకుసములధికులటంచు,
నిజేచ్ఛ నరిగెవిద్యాధరుఁడంతట । రవికులమౌళిజేరెశరభంగా
శ్రమమ్మునిగనె సీతానుజుఁడగు. శ్రీ. 3

చూచియెదుర్కొని పాద్యమొసఁగియు, చ్యుతుసుఖాసీ
నుఁజేసిపూజించి । నీచమత్తుల్లనసంసారరతుల్ । ఓచిత్తజజనక
నినుదెలియలే, రురుతరమగు కటాక్షముననినును । జూచితినేఁ చి
యఘములబోఁద్రోచితియ । హా చిత్రమనుచుఁబలికిశరభంగ,
యోగితారువుల్ ప్రోవిడియనలమునఁ జేచితి దరికొల్పియందురి
కెపీ, తాచంపకగంధీయుతుహృద్గ్రంథి । మోచనువిశాలలోచ
నుమానసమునందునిచి ముక్తతనుఁడయ్యెదటి । వేచివండకా
వాసులైనమునులాచతుర్భుజునిజేరజనిపాడగనిరి. శ్రీ. 4

మ్రొక్కిరఘూత్తముఁడుమునులారాసుఖ, ముగదామీ
కనిన రక్కసులచేఁ జిక్కితిమిబాధలఁ స్రుక్కితిమిగ్రక్కునమము

బ్రోవుమనుచు రామున । కక్కడనున్న కపాలముల్ జూపి వెక్కస మునవృజినులఘునులమునుల । జక్క జేసిరింతయు దైత్యకృతమే శరణమూమొరాలింపుమనినవిని । యుక్కడంతు దానవులనని, యభయమొసఁగెమునులకెల్లమదిరంజిల్ల । మక్కువతో భరతాగ్రజుఁడునిలిచె, మౌనిగృహములందుఁగొన్నేండ్లచట। నక్కఱతో జనికనియె సుతీక్షణుఁ, డనుమునీంద్రుఁడు పరబ్రహ్మమూర్తి యగు. శ్రీ. 5

## 2. మంగళకౌశిక - ఆదితాళము.

పల్లవి—వీనులవిందుగనువిన, వేయీచరితమిమ్ముగను.

అను—శ్రీనివాసునిబూజించి సుతీక్షణుఁడు స, మ్మానముగాంచి సానందుఁడై పలికెను. వీనుల.

రామనీతారకనామమంత్ర జపము । నేమమునఁజేసితి, నీరజాక్ష । శ్రీమహిళాధీశ శివవిరించసేవ్య । కామసంసారసాగర తరణచరణాలయని. వీనుల. 1

సతిసుతాదిఘోరసం, సారాంధకూప । పతితుఁడ నై, పాపమతినై । గతిగాననినను, గననిహైతుకదయా।మతివై నీవే వచ్చితివనెనుసంయమి. వీనుల. 2

సకలభూతమూన, సాలయుఁడవైనను । బ్రకటించినిన్ను జపమ్ముసేయని । వికలులమాయావివశులగజేతు । వకట నిను భజియించనఘముబాపుదువనెను. వీనుల. 3

విశ్వసృష్టిస్థితినిలయములకజహరి । విశ్వేశరూపముల, వెలయుదీవుహరి।దశ్యోఁడనేకపాత్రముల గనఁబడుభంగి।శాశ్వతుఁడవిడిమూఢ, జనులెఱుఁగరనేఁదపసి. వీనుల. 4

పరమేశప్రకృతికిఁ బరుఁడవౌ నీదివ్య । చరణముల్గంటి

దృక్సాన్వంతములకు గోచరుఁడవుగావైన, హరినీనామస్మరణ ।
పరమతుల కెపుడుగను, పట్టుదు వనెమౌని. వీసుల. 5

రూపాద్యుపాధిదూ, రుఁడవై నమాయానట । నాపా
దితమౌనీమూ, నవరూపముయిది । గోపాదగంటిస్మర, కోటి
సుందరముశర । చాపాన్వితముకరుణా, శ్రయనేత్రయనెను
ముని. వీసుల. 6

స్మితలలితాస్యము, సీతాయుతమజినాంబరము । జితము
సౌమిత్రిసేవితపాదమున । ప్రతిమమసితోత్పలా, భముమద్భా
గధేయ।మతిశాంతమగునీశు, భాంగముగంటిననె. వీసుల. 7

దేశకాలకర్త్రాతీతవిజ్ఞాన ముఖ । లేశ నీరూపమతి, హిత
మమలము । నాశరహితము స్వప్రకాశముసిఖిలావ । కాశము
చిద్ఘనా, కాశమని పొగడెముని. వీసుల. 8

ఈ రూపుభావించి, యికనొకటినామనసు । కోరలేదనిన
మునితో రాముఁడు చె । న్నారగఁబల్కెముని, నాథ నీమది
మత్స।మారాధనముననీ, ర్మలమౌ తెలుఁగుదుననె. వీసుల. 9

మీవంటిభక్తులఁ బ్రోవ వచ్చితినన్ను । భావించివిను
తించి, సేవించిమూ । కీవేగతియనువారి, కెపుడుఁజూపటుచుఁ ।
గోవిందుఁడవీవు ముక్తుఁడవై తివనెః జక్రి. వీసుల. 10

ఈపావనస్తోత్ర, మెవరు పఠించినఁ । దాపత్రయమ్మును
బాపుదురు । దీపించిమద్భక్తిదృఢమౌసుజ్ఞానము । ప్రాపింతురు
పరమ, పదమనెను రాఘవుఁడు. వీసుల. 11

మనమగస్త్యునిజూడ, జనవలెననిసుతీ । క్షణయుతుఁడై
సీతాలక్ష్మణులతోడఁ । జని యగస్త్యానుజుని, గని యవలశేష
శై । లనివాసుఁడగస్త్యా, శ్రమముఁజేరినుతించె. వీసుల. 12

### ౩. నవరోజురాగము - ఆదితాళము.

పల్లవి.—వినవే తరుణీమణీ శ్రీరాముని । వినుతగుణస్తోముని సుచరిత్రము.

అనుపల్లవి.—ఘనమైన షడృతుఫలసుమశో । భనమై, రాజిత బహువిహగ । స్వనమై జితనందనమైమౌని ధనమై, నరసుర మనోహరం। జనమై, తగునగ స్త్యునితపో।వనమినకులమణి, గని మెచ్చిసుతీ, క్ష్ణనీగురునకు, మా రాక దెలుపుమనె. విన.

స్వామిమహా ప్రసాదమనిసుతీ । క్ష్ణుండగ స్త్యుని డాయఁ జని మ్రొక్కియు । హామహాత్మ సీతాలక్ష్మణులతో, రాముఁడిటకు వచ్చినాఁడనినమౌని । యామాటవిని హెచ్చియెదురేగివారికి, శ్రీమీఱ నర్ఘ్యమిచ్చి, తోడితెచ్చి । రామా, యంబుజహిత కులాబ్ధిసోమా, నీలవారివాహస్తోమ । శ్యామా, శ్రీరామా హృద, యాభిరామసంగర । భీమా పాలకదలికదనజా, చేమును బ్రార్థితుఁడవై దశరథుని నోముపంటవై పుట్టితివని నుతించె. విన.

సకలభువనసృష్టికి పూర్వమునం దొకఁడవై నిరుపాధి కుఁడవైయే । వికల్పములేకయున్న నినుజెంది మూల, ప్రకృతి యైననీమాయయవ్యాకృతమనఁగ। ప్రకటమైసృజనసేయ, మహా త్తత్త్వమున। కొకటిగలైమునిగేయ, దానికహంకృతినామకమై, యొకటిజనించెగుణా। త్మకమై, అహంకారమున కర్భకమయ్యె నుదానివలననేకమై, తన్మాత్రభూతేంద్రియా । త్మకమయ్యెనన్ని టికిసూత్రా, త్మకమగులింగ మొదవెనందు విరాట్టు కలిగిజగ ములతఁ, దుసృజించెననెముని. విన. 2

నీపురజస్సత్త్వతమోగుణముల, నేర్పునను గొని బ్రహ్మవిష్ణు మహే । దేవరూపములఁగ్రీడింపుచు జగదుదయ, స్థితిలయముల

నుచేయుచుందువు మాయాగుణభేద । భావాభావముల నొంద
వు, అవస్థాత్రయములఁ । గేవలుఁడవై కనుఁగొందువుసా, క్షివి
చిన్మయుఁడవు । దేవాధిదేవ యోమహాను । భావా యెపుడు
సృష్టిలీలకుఁ । గా వాంఛింతువపుడుమాయను । నీవంగీకరించిగుణ
వంతుని । క్రేవసుందు వామాయవి । ద్యావిద్యలురెండైదనరు
విద్యయమృతకరమనుముని. విన. 3

వినుమవిద్యనొందినఖలులగుదురు, విద్యనెనయనమరు
లౌదురదినీపా । దనలినభక్తిచేఁగానిదొరకనేరదు, గనుకనీసేవఁ
బూనిజేసినయతఁడె । ఘనుఁడుకమలజానిపాదసేవకు, మొనయ
నీవాఁడజ్ఞానిస్వప్నమునందైనను । కనరా, దతనికిముక్తిమార్గ।
మనరా, బుధులువేయునేటికిఁ । దనరా, రనుమోక్షముఁబుధ।
జనరా, జితోడసంగతిననిమును । లనరా, జపగర్వమోహమద।
గుణరహితులుశమదమరతులుసర్వ, జనహితులు భగవద్భక్తి
రతులనెతపసి. విన. 4

ఏయుపాయమున, నైననీయందుఁ । దోయజాక్షునా, కు
ప్రపత్తిగలుగఁ । జేయుమునిరతము, నీదర్శనముసఫలమైచెలఁ
గెనాజన్మము నేఁడు నాక్రతువులెల్ల । శ్రీయుక్తములాయెఁజా,
డునాటనుండి నేఁ । జేయుతపమునకు నేఁడు, నీపాదార్చనముగ।
దోయి, సీతతోడనీపవి।శాయి, నామదినిల్వుమెందు । బోయి,
నావునసుని । ర్మాయి, స్మృతిగలుగఁజేయునతసుఖ, దాయియను
చుఁబొగడియతఁడయ । సాయకతూణీరచాపకృపాణ, సాధనము
లగస్త్యుఁడురాఘవునకొసఁగె. విన. 5

మేదినిభార, హారణార్థము, యీమేనుబూనినా, వుగా
వునరావణాదులఁ జంపుపొమ్ముపంచవటి గౌతమీనది చెంతదన

రారు రెండు యోజనములు। మీఁద నది చెలువుమీరునటకొన్ని నాళ్లు వినోదింపు ముదము చేకూఱుఁ గమలాకాంతా, వినోది గర్వితదనుజ చయవిభేదీ యోగిజనానందా। పాదీనిరతము జగ, దాదీసత్యవాదీయ ఖేదమణీ। వేదియనుపల్కు కుంభభవు, పాద ములకునతుఁడై శేషశైలవాసుఁడవలజనె నవనిజానుజులతో. వి.

4. దేశియదేవగాంధారి - అటతాళము.

పల్లవి — చానరోవినవే శ్రీరామ, చంద్రునిచరితము రసభరితము.

అనుపల్లవి — శ్రీనివాసుఁడు త్రోవఁబోవుచోఁ బర్వతశ, రీరుని జటాయువునిగనిసౌమిత్రితోఁబలికెను. చాన.

విలుదేలక్ష్మణాపీనిఁబోలియింతు వీఁడసుర। వలెనున్నాఁ డనిన నామాట, విని ఖగరాజు। అళుకుచు నిచ్చోట రామా నీవుశ్రీరామా నీవి। ట్లలుగకు భవత్పితృసఖుఁడను జటాయు వను వాఁడనాపైదయ। జిలుక వేయనుడుకౌఁగిట, నలమి యతనికి వారిసెలవొసఁగె. చాన. 1

భానువంశమౌళీ, పంచవటీగౌత। మీనదీతటమునం, దుఁజేర నచ్చటరా। మానుజుఁడనువొం, దుపర్ణశాలలు, ఆపర్ణ శాలలు। పూనరెండురచించెనొకశుభ, మైనలగ్నమునసీతా యుతుఁడైనరేంద్రుఁడచటనిలిచి, యలరుచునుగడపెమూఁడు నెలలు. చాన. 2

కందమూలములుల, క్ష్మణుఁడుదెచ్చియన్న। ముందరనిడి చరణ, ములొల్చుచురాత్రు। లందెల్లజాగరణ, ముల్సేయు చుఆసేయుచువి। ల్లందిశరములుఁబూనిసేవా, నందుఁడై యుండి

యొకతఱిగని । మందహాసవదనార, విందుఁడగు రాఘువునకని యెను. చా.

మోక్షకారణమౌ, మొదలితత్వ మంబు। జాక్షనీ వలననే, నుదెలియఁగోరితి । రక్షింపునీకన్న రక్షకులు, ఆరక్షకులులే। రక్షయజ్ఞానవిజ్ఞానవి, రాగయుతమనిదానిదెల్పు।। వీక్షణంబయనననుజున కిట్లనెనుదాశరథీ ధీనిధీ. చాన. 4

వినుమాయస్వరూపమువివరించి, వెనుకసంవిద్రూపుఁదెలిపెదను । అనాత్మయైన యీతనువె, యాత్మగానెవను దోఁచుచే మాయ, తోఁచుచేమాయ । అనఘదానివలనసంసారమౌ, యావిక్షేపావరణము । లనెడుయీరెండౌమౌ, యకాకృతులనె రాముఁడనువుగ. చాన. 5

పరగజగములింగాద్య బ్రహ్మాండముగవిక్షే, పముసృజించెమించియౌ । వరణముపరమాత్మనావరించిజ్ఞానరూపమై, జ్ఞానరూపమై । బెరసెఁద్రాడహియని భ్రమసిన, ట్లురుమాయచేనైన జగములు పరతత్వమునగల దనుటరయనవిచారమనె రాముఁడు. చాన.

కలలోఁగన్న వస్తువుల, వలనెసత్తుగా దఖల । ములుమహేంద్ర జాలముసంసారమను, బలుచెట్టునకుమూల, ముదేహమేనని, దెలిపితన్మాత్ర భూత హృదింద్రియాహంకారబుద్ధిప్రకృ। తులునహంతయునుతనువన, జెలఁగు నన్నిటికాత్మసాక్షియనే. చాన. 7

జ్ఞానమునకు నహంకార, మానడంభజయమలుక, మానుటబుజాభావము సేవించిభక్తి। చేనిజగురుని దైవముగాఁగనెన్నుట, గాఁగనెన్నుట। మేనిదోసములెఱుఁగుటతనువు, నోని

గ్రహము ఈషణవిరతి, బూనినానందనస్యం, బైనమతియును సాధనములనె చాన. 8

ఆసలన్నిటినిజ్ఞా, నాసిచేడనిమి, సచ్చిదానందచైతన్య ముతానని దెలిసి। భాసిలుటెసౌజన్యము, వాఁడెధన్యుఁడు। డాసి యనుభవము గురుశాస్త్రాభ్యాసముననగని జీవపరులవి । లాసవైఖరులఁగూర్పఁదొలంగు మాయయిదెము క్తియనె. చాన. 9

మచ్చరణస్మృతిలేని, మనుజులిదిజెందలే। రచ్చపుతమములో, నజ్యోతిలేకగని, వచ్చునేయేరికైనగావుననన్ను, గావు నన। నిచ్చఁదలఁచువారలకుని, మ్మావిద్యయొరులకీవలదని। హెచ్చుగాఁదెలిపె శేషగి, రీశుఁడనుజునకుముద మొదవఁగ. చా.10

5. అఠాణరాగము. - ఆదితాళము.

పల్లవి.—వినఁగద వేమద, వేదండగమన। మనసారసార, సనేత్రుచరిత్రము.

అను —మనుజాశనికా, మరూపిణియు శూ। ర్పణఖయనెడుమా, నినివచ్చియపుడు। కనుఁగొనెరఘువ, రునిజగద్గురుని. విన.

ఆదరహాసమామహోల్లాస । మాదరస్మేరకటాక్ష విలాస। మాదరదళితాబ్జాస్యవికాస, మాయిందిరాసఖిసుఖనివాస। మేదనర్చ్యయురముసుందర, మైయఒరునుదరముఆనతజన। ఖేదములనడఁచిమోదములనొసఁగఁ, గాఁదగుచరణపల్లవములు ఆ। మీఁదటనఖసౌష్ఠవములజిగిఁ। బ్రోదియిడు తొడలచందము రామునిపాదపద్మములయందనుగని, యాదానవిమదనాశుగము లచే, నదరిచెదరి దనుజారితోఁబలికె. విన. 1

ఎవ్వరుమీరుఏమి మీపేరు, లివ్వనికిట్టేలనే తెంచినారు

ఎవ్వరికిమూసలిచెలువారు। జవ్వనియెవ్వతె, నిన్ను వేమారు।
బువ్వువిల్తుకేళిఁగలయఁగఁ, బూనినాను బాళినన్నేలుము।నవ్వు
గావనఘరా వేసుశూర్ప, ణఖయందు రావణునకుఁ జెల్లెలి।నివా
ర్తకతఁడు ముదముచేఁగడు, నివ్వాటిల్లు ఖరదూషణాదులునిన్ను
గొల్తురరిభీషణాయనిన। నవ్వుచుసీతవినఁ, గ రాముఁడనియె, నవ
నితకుభయహితవులొదవుగాను. విన.

మనుకులుఁడనురా, మాభిధానుఁడను, వినుదశరథవిభు
తనయుఁడనతఁడను। పనిటవచ్చితి మదనుజుఁడివిగోకనుఁ, గొను
మీపతినే, ననలసాక్షిగాను। ఘనతఁ బెండ్లియాడినాను, గనుక
దీనితో, డిఖూపోటికి, మొనసినీవురో, ఫుడు వెసౌమిత్రి, నెన
యుమునినఁ, జని వేఁడివనతఁ, డనియొలలన, ననుగూడిననీ, వుడు
దాసివవుటనిజ, మనరాముని, యొద్దికేగియది ఘనాకృతిఁ, గనలి
సీతపైఁజన లక్ష్మణుఁడపిగొనిముక్కుఁజెవులఁ, గోసెరక్కసికి. వి.

అఱచుచుఁబారి, యనిఖరునిఁజేరి, మొరవెట్టసురారి
భూరిరణభేరి,పరఁగఁగదలి, శూర్పణఖచేదారి, నెఱఁగిబలములరి,
ముడిసడచెమీరి, పరులువచ్చుటగనియనుజుని, ధరణిజనుందో
డ్కొని, యగ్గిరిగుహ, కరుగఁబనిచి రాఘవుఁడుధనుశ్శర, వర
కరుఁడై బలువీరులదార్కొనె, ఖరదూషణత్రి, శిరులుదాఁకిరి,
హరిపైజను నేనుఁగులున్సా, హరిమెఱయసేన, నొకబగలునఁదెగ,
నరికినారాయ, శాస్త్రమునరాముఁ డరులదోరలతలల, దొర
లసేసె నవనిపై. విన. 4

తమ్ముఁడువచ్చి సీతనుదోడితెచ్చి యమ్మెఱునన్నసా,
హసముమెచ్చి, నెమ్మినుండెను సు, ఖమ్మునహెచ్చియమ్మువిర
క్కసి, యటలంకఁజొచ్చి, పమ్మిరావణుచరణమ్ములఁబడి, వగవ

నతఁడు కరుణను జెలియలిఁ గౌఁగిట, గ్రమ్మియిదేమన రామలక్ష్మ
ణులు, కాంతారసీమ మెలఁగ రాముని కలికి చెలువలరి చెలఁగగానీ
కిమ్మన నన్నిటు జేసిరినీ, తమ్ము, లిందుకై పోలసిరియనిన, కొమ్మ
నూరార్చిర, త్రోవిభుఁడు రాముని నిమ్మహి శేషగిరీశునిగాఁ
దలఁచె. విన. 5

### 6. ఘరజురాగము - అటతాళము.

పల్లవి.—ఇంతి చెంగల్వ, బంతి చెలువల మేల్, బంతి గుణముల,
దొంతి వినవే.

అనుపల్లవి —శ్రీకాంతుఁడు గాకున్న ఖరదూషణాదులనా, వంత
లోనఁ జంప, నెంతవారు నరులని చింతించి దశకంఠుఁ డసురుల,
శిక్షింపఁ జక్రి యినకులమున, మంతుకెక్క జనించె శ్రీరా,
మాఖ్య బ్రహ్మాదినుతుఁడై యనె యింతి.

వినఁగానిమ్ము శ్రీ, హరి చేతఁ బోలిసితె, మానుగ వైకుంఠ,
మందిర మేలుదు, నేనతని గెలిచితి, నేనిరాక్షసరాజ్య, మీనేల
గలదనుక యేలుదునని తలఁచి, భానునిభ మగురథ మెక్కి విధి,
వూనిక్రే రేపదుర్మతివై, రానుగత హృదయుఁడై చనియెను
రావణుఁడు మారీచునింటికి. నింతి. 1

వచ్చిన దను జేశుఁ, జెచ్చెరఁ బూజించి, వచ్చిన పని దెల్పు,
మనెనన్న మారీచు, మచ్చిక జేసి రావణుఁడు, బలికె రాముఁడు,
హెచ్చి కానకు దశరథేశుఁడు బంపఁగ, వచ్చి మునులకు నెల్ల
నభయంబిచ్చి మన ఖరదూషణాదుల, ద్రచ్చినాఁడట రాముని
సతిని, దెచ్చి యేలుదునన నతఁడనియె. నింతి. 2

రాముఁడు నరుఁడని, రావణ తలచేవు, శ్రీమహావిష్ణువు,
సీతా మహాలక్ష్మి, మీ మేను బూనినాఁ, డిచట నిను బోరిగొన,

నామహోత్ముని చెనకు, టదియేమృత్యువు వినుమి। శ్వామిత్రు క్రతు
వునసుబాహుని, జంపిరఘుపతి నన్ను శరమున। నీమహోదధి
పై చెబ్రదికితి, నేమిసుకృతముకతన నోయనె. నింతి. 3

హరినన్ను బొలియింప, నపతరించినట్లయితె। వెఱచితేఁ
జంపక, విడుచునా లేలెమ్ము। మెఱసినీవ్రమాయా, మృగమై
రాఘవులస। త్వరముగ భ్రమియింపు, ధరణిజనేఁదెత్తు। మరు
మాటలాడనినుజంపుదు, మారీచయని రావణుండన। వెఱచి
హరిచేఁ దెగినమోతము, వీనిచేఁబడ నేలనికదలె. నింతి. 4

పదియాఱువన్నియ, బంగారువలెఁదనువు। పొదలమే
నిపై వెండి, పువ్వులవలెచుక్కలు, గుదిగొనమణిరుచులఁ, గొము
రారుకొమ్ములు। కొదమరత్నము లనఁగా, గొరిసెలుదనరఁగ।
నుదుటనీలములవలెఁగన్లవ, యొప్పమారీచుండు లేడియై, కదిలి
శేషగిరీశుఁడగు రా, ఘవుఁడున్న పంచవటి, జేరెను ఇంతి. 5

7. నాయకిరాగము - ఆదితాళము.

పల్లవి — దీనభక్తజనసౌఖ్యదాయకి, ప్రాణనాయకి వినవే.

అను. — ఆభానుకులుఁడువికాంతమునసీత, తోనిటులనె రావణా
సురుఁడిదెనిను గొని, పోనడగు దెంచెనీవంతర్హిత, వై నీదగు
ఛాయామాత్రమునిలు, మీనసువర్ణాంతమునందు పొంద,
గానీకగుననన్నట్లనిల్చెసతి. దీన.

చెలఁగుకపట మృగముఁజూచిమాయా, సీత దీనిఁగొని
తెమ్మనినశౌరి, విలునమ్ములుఁగొనిచనుచుజానకిని, గొలిచియుండు
సౌమిత్రి నేనీలేడి, సలలితముమీరఁ దెత్తుననిన ల, క్ష్మణుఁడిది
మారీచుఁడు చేయుపో, కలువలదీ కార్యము బూనఁగాన, గారి
స్తుతయన నిల్వకే గెహరి. దీన. 1

సర్వపూర్ణుఁడయ్యునచలుఁడయ్యును, సతియయ్యులో
కానుసారియై, పర్విడిమాయామృగము వెంటఁదగిలె, భక్తపోష
ణుండనెడినుడివి విదితముగా, సుర్వీతనూజకోరికదీర్పఁగ, సుద్దం
డాటవిరఘువీరుఁడుచని, దుర్వారామర్షణుఁడై మృగంబు, సుర్విం
బడనేసెనిశితాస్త్రమున దీన. 2

త్రుళ్లడంగికపటరూపు చెడిమా, రీచుఁడోరలు చోహా
లక్ష్మణా, చెల్లరేనన్ను బ్రోవుమనిచక్రి, చీరినటులదోచనార్తరవ
మునవిలపై, త్రెళ్లుచుమహీశుసన్నిధిచేము, క్షితింజెందెనచటనా
ర్తధ్వనివిని, తల్లడపడిభూమిజ రాముఁడాప, దంబొందెను జను
లక్ష్మణాయనెను. దీన. 3

మూఁడుజగములనికిదోడరినసురా, ముఁదు భయార్తుఁ
డౌనె, చెలియ తెలియక, నాఁడితివనుజుఁడనియతివసుజను
లాడరానిమాటలాడనాతండదివినఁ, గూడకహారీయనుచునన్న
చనిన, జాడంజనరావణుఁడిష్టము, చేకూడెననుచుఁజేరెనువాని
యని, గూఢాత్మాకృతియైధరాసుతను. దీన. 4

పూజజేసిసీత పలికె, మహా, పురుషనిలుము మత్పతి
వచ్చుదనుక, నా, జనకజగనిమీరెవరుదెలుపు, నాతియనినన
యోధ్యాధిపతియగుదశరథ, రాజకోడలను రామునిభార్యను,
లక్ష్మణుఁడనుతమ్ముఁడుదానునువని, రాజీవాక్షుఁడుపదునాలుగు
వత్స, రంబుల్ నిలజనకాజ్ఞవచ్చెననె. దీన. 5

విన్నువిందునన, రావణుఁడనా, నెలవులంకదనుజవిభుఁడ
జగముల, నన్నిటినిగెలిచి, నాను ననుబొందు నరునిపొందునీ
కెందుకనవినిభయంబు,। నన్నేలత యోరిఖలుఁడనిను రాముఁ

దస్త్రాహతుఁజేయునవ్వ రావణుఁ, డెన్నికఁబడితల, లిరువదిక రంబు, లిమ్మెతగరథమందుసీతనిడె. దీన. 6

అలఘుగతినిబోవ శేషగిరినిల, యాహరిరామలక్ష్మణా యనుచుఁ, గలికివిలపింపవినిజటాయువది దెలిసివచ్చిరణమొనర్చి కూలెను, గిరివలెఁ, గులుకుచుదశాస్యుఁడరుగగిరినైదు, గురు కపులనుగనితోడవుల్ ముడియిడి। చెలిపై చెనచటలంకాపురంబుఁ జేరియశోకవనిసతినినిలిపె. దీన. 7

8. లలితపంచమిరాగము – ఆదితాళము.

పల్లవి.—ఓవనితామణిరో వినవే.

అను—వేవచ్చులక్ష్మణుని, వీక్షించిహరిమది నొకటిదలఁచె. నో.

నేసాక్షినాదునైన। నీజగముమాయామోహా।వ్యాసంగ మొందఁజేతు, ననిరెుంచి।హాసౌమిత్రి హాసీత నచటడించివత్తురా తప్పు, జేసితివింకనేమి, నేతుననిరాముఁ గనియతఁడుపలికె. నో.

ఆర్తనాదమువిని, యవనిజనన్నుబొమ్మన్న। నార్తరక్షకుఁ డతని కడలకుమనిన। నార్తిచేవినరానిదు,ర్వార్తలాడనీమార్గా ను, వర్తినైవచ్చితినన్ను మన్నింపవేయోదయానిధీయనెను. ఓ.

ఆమీఁదఁబర్ణశాల, కరిగిసీతలేకున్న। రామచంద్రుఁడు శోకవా, రాన్నిధిమునింగి। తామహాకుమారుఁడయ్యెని, గ్గళిత దుఃఖరాశియయ్యెఁ। బామరులకుఁజూడఁ జింతా, పరవశుఁడై వెట్లువిలపింపఁదొడఁగె. నోవని. 3

హాపూర్ణచంద్రానన, హాచకోరాక్షియింత। కోపమా నాతోఁబలుక, కుశ్మా వేమి। ఓపరమస్వాధియింకనేనెట్లోర్తు నిమిషమొకయుగమాయెఁ। బాపుదైవమింతపగవాఁడౌటె టుఁగననివనితను వెదకె. నోవని. 4

వెతకుచు రాఁగా హత, పక్షుఁడై పడియున్న । పతగేంద్రుఁ
గని లక్ష్మణా, పరికించితే । అతిపెనీతఁడు మ్రింగి, హతుఁడైనట్లు
న్నాఁడు వీని । ధృతిచేఁ జంపుదు, విలు నమ్ములు, దెమ్మనిన రామునే
జటాయువుననె. నోవని. 5

హరిహరియనిడాయఁబోయి, యతనిచేఁ దద్వ్యథ మెల్ల । నె
ఱిఁగి పక్షిరాజున్నై, కరమున నిమిరి । పరగఁ బోధించిన రామా,
హరిపరమాత్ముఁడవు నిన్ను । కరమర్థిఁ జూచితి ముక్తి, గంటినని
ప్రాణముల్విడిచెనతఁడు. ఓవని. 6

చితిఁ జేర్చి పులుఁగు మేను, శిఖి చేఁ దహించెనంత । ధృత
శంఖచక్రగదాబ్జా, న్వితుఁడై హితుఁడై । నతుఁడై రుచిరతనుఁడై
వరవిమా, నారూఢుఁడై జటాయు । వతిభక్తి శేషాచలపతియౌ
రామునినుతియించఁ దొడఁగె. ఓవని. 7

## 9. జటాయుఃకృత శ్రీరామ స్తవము.

### చూర్ణిక.

శ్రీమదగణితగుణమణిగణాలంకృత రుచిరచిరతర శుభస్వరూపం, సకలజనభయావహమహదజ్ఞానజనితకలికలుషాంధతామిస్రనివారకభవతారకదీపం, అనుపమాద్భుతమహత్ప్రతాపం, హతదీనజనతామనస్తాపం, కరధృతవిదితామోఘశరచాపం, జగదుదయస్థితిసంహారావిర్భావతిరోధానాదిమహామాయావినోదనిదానం, అంగీకృతరంగన్మంగళాభంగతుంబురునారదసంగీతవీణామృదుగానం, భూతభవిష్యద్వర్తమానకాలత్రయాబాధ్యమానం, అసమానం । అక్షీణకటాక్షవీక్షణరక్షితదాక్షాయణీప్రముఖనిఖిలభక్తజనసమూహం, నిర్దళితసకలసందేహం, దుర్వారోర్విభరణహరణ నిర్వహరణచరణలీలామాన

వదేహం, నిరీహం, శ్రీమత్కారుణావలోకనమాత్ర క్షపితఫాలా
క్షచతుర్ముఖాదిసర్వసుపర్వాఖర్వఖేదం, నిరంతరామనస్కసమా
ధిపరిపూర్ణపరమయోగీంద్రహృదయ సరసీరుహకర్ణికోపరిస్థిత
వితతజగత్పవిత్రా కృతాద్భుతప్రభావ భాసురవియన్నదీజనక
విభవాభిశోభిత కిసలయమృదుపాదం, సమస్తజనానుమోదం,
నతజనసంతతసకలకల్యాణగుణసంపాదం । దళత్పుండరీకపత్ర
జైత్రవిపులతరమనోహరవిలోచనం, శిలామయమానియోషా
ఘర్షణ దోషవిమోచనం, యాచితవైరోచనం । కుముదబాం
ధవ కిరీట ప్రచండకోదండ ఖండనోద్దండ దోర్దండసముద్దామం,
దేవతాసార్వభౌమం, రవికులపయగపారావార పరిపూర్ణసో
మం, గర్వితపూర్వగీర్వాణవాహినీసందోహకఠినకంఠలుంఠన
గళచ్ఛోణితారుణిత సహస్రకర సహస్రకోటిప్రభాభాసమాన
మహాభూతభయంకరసుదర్శనాభిధానావక్ర చక్రాయుధాభిరా
మం, మారీచసుబాహువిరామం, హారహీరనీహారకర్పూరసు
ధాసారడిండీరశరన్నీరద శారదానారదపూర్ణిమాచంద్రచంద్రి
కాధిక్కారదశదిగ్వ్యాపితధవళయశోధామం, శ్రీరామం । జనన
మరణాదిఘోరసంసారమహాగహనదావదహనాయమాన సకల
జగజ్జేగీయమానపావననామధేయం, సూరిజనభాగవిధేయం,
ఇంద్రనీలమణిప్రతీకాశాతిస్ఫుటసుందరకాయం । రమాకాం
తాకుచకుట్మలతటిచర్చితపటీరకుంకుమసంకుమద మిళచ్ఛందన
పంకముద్రితశోభనవిశాలవక్షసం, హత ఖరదూషణాది రాక్ష
సం । రూక్షేక్షాశిక్షితవిపక్షం, ప్రపన్నావనదీక్షం । పరధనపర
దారావిముఖమునిజనసేవ్యం, దుష్టజనదుర్విభావ్యం, ప్రణవైక
సంస్తవ్యం, శ్రుతిశిరోవీధికాశ్రావ్యం । విలూనదంభాభిమాన

నానాభువనసంస్తూయమానమానవవపుర్నిర్మాణా సమానమానససరోవర ముహుర్ముహురుద్గతసముత్తుంగాఖండానందవీచీపరంపరాలీలాడోలాందోళితచిన్మయరాజహంసం, రాజకులావతంసం, స్మితమనోజ్ఞాననేందుమండలం, రత్నప్రభాచకచ్చకితచామీకరచారుకిరీటకుండలం, పోషితాఖండలం। గుణత్రయశక్తిత్రయమూర్తిత్రయానువృత్తం, కరుణామయచిత్తం। పనసామ్రకదళీక్రముకఖర్జూరజంబునింబజంబీరపున్నాగచంపక మధూకవకుళాశోకతమాలసాలరసాలాది కోరకితపుష్పితఫలితలలిత మహామహీరుహారాజీవిరాజిత రత్నచ్ఛవిచ్ఛటాలంకృత సానుప్రదేశసంతతసముత్పతన్నిర్ఝరాకలిత ప్రశస్తసమస్తవిలాసోల్లసిత శేషాచలశిఖరమధ్యసువర్ణప్రాసాదవిహారణశీలం, తోషితాశేషభూపాలం। సురాసురయక్షరక్షోరగ గరుడగంధర్వసిద్ధసాధ్యకిన్నరకింపురుషవిద్యాధర చారణాప్సరోబృందరచితబహువందనం, భక్తజనచందనం, రఘునందనం, త్వాం భజామి త్వాం భజామి.

## 10. శహాన - అటతాళము.

పల్లవి.—శౌరికూరిమిమీరికౌమారిఖ। రారిచరితము వినవే.

అను.—శ్రీరాముఁడుజటాయువుభక్తికిమెచ్చి। శ్రీమీరఁగఁగై వల్యమిచ్చియావలజనిపోచ్చి కోరి.

సానుజుఁడై సీతనరయుచురాముఁడు, జనిఘోరాకారుఁడైనరక్కసునిఁజూచి। మానధనుఁడౌలక్ష్మణునితోడఁ బలికెను, వీనిబాహువులలోన నిప్పుడు మనము। పూనిచిక్కితిమికన్నులుగాళ్లుఁదలలేదు, వీనికిననితెగువతోన రాఘవులిరువురు। వాని

యోజనదీర్ఘబాహుద్వయముఁ దెగనఱికినఁగబంధుఁడు । దాని
కద్భుతమంది మీరెవ రేనెఱుఁగనననఁజక్రిపలికెను. కోరి. 1

దశరథసూనులము రామలక్ష్మణులము, తండ్రియాజ్ఞ
వనమునసీతతోడ । వసియించియుండుమము వంచించియొవఁ
డోనా, వామాతఁగొనిచనెను, వెదకుచువచ్చి। వెసనిన్నుగంటి
నీవెవఁడనినగంధర్వ, విభుఁడజునివరమునను జిరజీవినై । కొంసరి
యష్టావక్రమునిగనుఁ, గొనినగినసురవగుమనిత । పసిశపించె
విమోచనమురఘుపతి సేయుననెనుదైత్యుఁడు. కోరి. 2

దనుజతనువుగాల్చి మెఱఁగింతు సీతావృత్తాంత, మన
నన్నిట్లుసేయఁయరుదరుదిది । యననసురాకృతివిడిచి దివ్యగంధ
ర్వుఁడై , వినుతించెహరినీమాయ మానవాకాయ । మనఘుదు
ష్టనిగ్రహార్థముబూనితివిపరమాత్ముఁడవుదై వరాయ,సన్ముని గేయ।
మనోవాగగోచరుఁడవనా, దినిధనుఁడవఖిలసాక్షివిచి, ద్ఘనానంద
మయుఁడవు । రఘునందన వందనములుచేకొనుమనె కోరి. 3

రూపరహితుఁడవయ్యు రెండురూపములుగల, వోపర
మపురుషనీకు, స్థూలసూక్ష్మముల । ప్రాపుసజగములు గలుగు
వెలయునడఁగు నీపాదమానపరాకు, హిరణ్యగర్భ । యేపున
సూక్ష్మమయి విరాట్టనువుస్థూలమై, దీపించెనదిమాకుఁ, దెలి
యుమును లలమట । కోపిధ్యానము సేయఁగ విరాట్పురుషుఁ
డన ధారణాశ్రయుఁడై । చేపట్టిరామునితనువె సుమ్మఖిలజగ
ములునెఁ గబంధుఁడు. కోరి. 4

వానిజ్ఞానముమెచ్చి వరదుఁడుబలికెను వరమహాయోపా
వన స్తనమునుఁడివినవినిన । గాని,వారికిసిరుఁలుఁ గలుగుదురితము
దొలఁగుఁగలుగ దెన్నఁడు భయమని సెలవియ్యఁ । గానైరావణుఁ

డనురా, కుసుమ సీతసులంక, లోనుంచినాఁడీదినము, శబరి వద్దకుఁ జనుఁ, డా నెలఁత చేసకలమునువినఁ, గానగునసుచుఁగిన్నరుఁడుజనె, ఘానుకులమాళి శేషాచల, పతిమతంగాశ్రమము జేరెను, కోరి.

## 11. మాంజిరాగము - ఆదితాళము.

పల్లవి — హితమతిసతీ పార్వతీ యీ, చరితమునిన వే.

అను — పతిపతిశతాధికరుచి, రాంగులౌ రామలక్ష్మణుల, నతి వేడ్కఁజనియానం, దాబ్ధి దేలి శబరియెదుర్కొనెను. హిత.

పదయుగళికి మ్రొక్కి, పాద్యమొసంగి, తదంబుకణార్ద్రి సదమలసర్వాంగి, యైహరిదర్శన, ముదితవిలోచనజితసారంగియై, రాఘవులనుస, న్మృదుఫలగంధమాల్యములఁ, దృప్తులఁజేసిహృదయముల, ముదమొదవఁబలికెను రాముతో శబరికరఘటితాంజలియగుచు హిత. 1

నినుగనిధన్యనై తనరిలిఖలుల, దునుమఁగమునులమను పఁగదశర, థునిసుతుఁడై నారా, యణుఁడుజనియించు ౹ నని నా గురుఁడుసువ్రతుఁ, డై దెల్పెనుమతంగ ౹ మునియది నేఁడునిజమా, యెశరణుశరణుదైవరాయా ౹ వనితనుహీనకులజను, నిను దెలియఁజాలనన రాముఁడుబలికె హిత. 2

కులనామాశ్రమా, దులుహేతువులుగావ, బలనను దెలియఁగ, భక్తియొకటివినాయజనదానతపోమంత్ర, ములుభక్తిహీనములైనవి, ఫలములుగనుక, దెలిపెదభక్తిమార్గము, సులభమగునపవర్గము, తొలుతసత్సంగతియా, వలమత్కథాలాపగుణరతులనెను. హిత. 3

ననుఁగోనియాడుటయు, ఘనగురుసేవయు, మనియ మాదులను, ననుబూజించుట, ననుభజించినవారలను, గని సంభావించుట సకలభూతముల, ననుగాగనిశమదమముల, నెన యుటవిమల చిత్తముల, ననువివరించుటయునివినవవిధభక్తు, లని తిరుగాహరిబలికె హిత. 4

భావముసజ్జన, సేవనువిమలమైనది నీకు, గావుననను జూడఁ, గాఁగలిగెనిఁకజానకి తెలుఁగు, వేవేగ మెజాడ గాఁదెలుపు మవసతిని, రావణుఁడెత్తుకొని వేగ, లంకకుఁజనెనుమహాభాగా, దే వాది దేవనీకుఁదెలియని, దిగలదేయనుచుఁజెలిపలికె హిత. 5

పంపానామసరో, వరతటిబుశ్యమూకాద్రిపైఁ, బెంపున సుగ్రీవుఁడున్నాఁ, డతనిసఖ్యము చేయుఁడింపుననతఁడుదోడ్ప, డు వని తెలిపి శబరి, తెంపుననచటఁజితిఁజేర్చి, దేహముచిచ్చుతోఁ గూర్చి, సొంపునశ్రీవిభునిదలఁ, చుచుదను వెడసిపరమపదమున కరిగె. హిత. 6

ఈరఘువర స్తవము, నెవరుబఠించిన వినిన, వారుకోరిన కోర్కెలనిచ్చు శేషాచలేశుఁడుకృపను, ఘోరదురితములనుబు, చ్చునిదిజయా, కరముసూరిజనానందకరము, దారిద్ర్యసంకట హారము, ఆరణ్యకాండము శ్రీమీరసుబ్రహ్మణ్యకవి తెనిఁగించె॥ హిత. 7

శ్రీమదధ్యాత్మ రామాయణ కీర్తనలు

అరణ్యకాండము సంపూర్ణము.

శ్రీ ర స్తు.

# శ్రీమదధ్యాత్మరామాయణకీర్తనలు.

## కి ష్కిం ధా కాం డ ము.

---

### 1. మారువరాగము - ఝంపాతాళము.

పల్లవి.—శ్రీహిమాచల వరసుతాయీకథను, మాహితమతివై వినవే.

అను.—మోహనాబ్జోత్పలా, మోదయుతమైవిమల, మైహంస చక్రవా, కాదివిహగ కులకో, లాహలమై, పనసామ్రవకుళ కదళితరునలతతీరమైతగు పంపాతటినిడాసి, సాహసవిక్రమ కళాకు, శలులగు రాఘవులు, స్నానపానములుజేసి, శ్రమము బాసియలరిరి. శ్రీహి.

వరఋశ్యమూకాద్రి, సరణిఁదప్పకనడచు, వారిశరచాప ధరుల, నృపవరుల, నురుజటావల్కలాం, బరులఁజూచి, వెర గొంద సుగ్రీవుఁడరులనితలఁచిమంత్రి, వరుఁడైనహనుమంతు, వారినెఱుఁగఁగఁబనుప, నెఱవడుగై చనిమారుతి రామునియం ఘ్రులు, శిరమునసోఁక నతుఁడై జగదుదయ, స్థితిలయ, కరణశీలు లైపురాణ, పురుషులైతనరు, నరనారాయణులో గాకమీరె, వరని యడిగెను. 1

వినులక్ష్మణాయితని, వినుతవాక్పటిమంబు, ఘనశబ్దశాస్త్ర యుతమై, శ్రుతిహితమై, తనకెనని హారివటువు, నతిమైత్రితోఁ గని నే, దాశరథిని నను రాముఁడందురు నా, యనుజుఁడితఁడు,

లక్ష్మణాఖ్యుఁడు సీతయనుసా, వనితయు నేను నితఁడు నడవుల
చరించమ, జనకుశాసన, మునవచ్చి పంచవటినుండ, దనుజుఁ
డెవఁడొకన్మోఱఁగి సీతనెత్తుకచనె, దానివెదకెదము నీవెవరో
దెలుపుమనె రాముఁడు. శ్రీహి. 2

వానరేంద్రుఁడుసుగ్రీ, వాఖ్యుఁడీగిరినమాత్యులుఁ, దా
నున్నారువాలికి, భయపడిను, హనుభావానను మీపాలికిఁ,
బంపె । నేనుసుగ్రీవుమంత్రిని, వాయుసుతుఁడ హను।మానా
హ్వాయుఁడసూర్య, సూనునకుమీకుఁజెలిమి । మానితముగఁ
జేసెదననుటకు రాఘువులు నను, మతింప వారిఁదన మూఁపుపైనిడి
తెచ్చి । భానుజుకెఱుఁగసేయఁజెలంగి రామునిపాద, పద్మముల
కెఱఁగితరుశాఖపీఠమిడియెనతఁడు. శ్రీహి. 3

రామాభిగమనంబు, సౌమిత్రిచేఁబ్లవగ, రాజువినిరిపువి
పాలా, వగపేల। భూమిసుతజాడ, యేలీల, నైవందెత్తు। స్వామిం
రొయొకదనుజుఁడొకసతినెత్తుకొనిపోవ, భామమైతొడవులిటు, పా
ఱవైచెననియియ్య। రాముఁడుఁగనిసీతాహా, యనివిలాపింపఁ
బామరునిరీతిదైన్య, పడఁదగదనిరవిజుఁ। డామహామహుని దెలిపి
యగ్నిసాక్షికముగఁ బ్రామాణికములుచేసికొనిరి సఖ్యమునకై.
శ్రీహి. 4

మయసుతుఁడుమాయావి, వాలితోనని బెనఁగిపుయిలోడి
యసురతొలఁగి, గుహఁజొరని । ర్భయుఁడై ఘానితోలి, చెలఁ
గియచట, దయచేనన్నునిచి పోయితానెలకురాకున్న । లయ
మాయెనన్నయనితలఁచి, గుహన్గుశిలద్రోచి । భయమునజని
యదిదెల్పగసచివుల్ ననుఁగపి, పతినిజేసిరరిఁబోరిగొని మాయ

న్నవచ్చి । ప్రియను రాజ్యమును గొని నను దరిమిన శేషగిరీశ నేనది
మొదల్, ఇచటనునికియనెనిసినజుండు. శ్రీపి. 5

2. కళ్యాణిరాగము - ఆటతాళము.

పల్లవి —తగవిన వే యీచరిత్రదళ, త్కంజదళమంజులనేత్రా।
నగవిభేదన మణినిచయకాంతిస్ఫుట, సుగాత్రనుతిపాత్రా.

అనుపల్లవి.—వగబొఁగలురవిజుఁగనిహారినీ, పగతుఁడుని మెదనన
బలాధికుఁడగు వాలిగెలువనెట్లగునని, యతఁడన్న బలమెన్నఁ
గడఁగెను. తగవిన.

దుందుభియనెడిదనుజుఁ డాహవ, దోహాలతమహిషరూ
పుఁ। ఔందివాలినిదొడరగొమ్ముల, సందెడలఁజీల్చి యతఁడేపు
మ్రందించి కాలందన్నినత, ద్రక్తమిాగిరినెఱయవాలిని। ఇందు
రాఁదలపగులుననిశపి, యించెను మతంగుఁడనెగపిపతి తగ. 1

అదిమొదలిచటనుందునభయత, ననఘదుందుభిశిరంబు,
అదే యోజనముజిమ్మినవాలి, ననిగెలుతువనవినిముదంబు, గదుర
కుదియోజనాల్ జిమ్మినఁ గనిసప్తతాళపత్రములత, గదమి
యొకపరిగోయునటులవి, చిదుముమనహారినగి విలుకొనియె.
తగవిన. 2

శరమొకటి శ్రీరాముఁడేసిన, సప్తసాలములఁద్రుంచి। గిరి
ధరాతలరసాతల, నెఱఁగిపోదిజేరెనదిగాంచి। తరుచరాధిపుఁడు
రామునిపా, దములకలరుచుమ్రొక్కిశరణని। చరాచరమూల
మైనపరా, త్పరవస్తువనిపొగడఁదొడఁగెను తగవిన. 3

నాపూర్వపుణ్యఫలముజగ, న్నాథనినుఁగనుట నేఁడు, ప్రా
పనితలంత్రునినుసంసా, రనివృత్తికైఘనులుజూడు। శ్రీపతిసతి

సుతధనముకాం, క్షించిబుద్బుదసమంబదినీ । ప్రాపువెన్నిధివేద కబ్బిన, పగిడినేగంటిననెనినజుండు. తగవిన. 4

క్షణమెనఁడునీయందు మఱని, ర్బలముగానుంచువాని । ఘనమోహాలతసమూలముఁదెగు, నినుఁదాఁపుదాఁపుయనువాని । వినుతించ బ్రహ్మహత్యాశత, మణఁగునిఖిలబ్రహ్మాదినితో । చెన టంచుఁగొంగలించెనుశ్రీ, శేషగిరిపతినిసుగ్రీవుఁడు. తగవిన. 5

## 3. రేగుప్తిరాగము - ఆదితాళము.

పల్లవి.—గరుడగమను సచ్చరిత్రమువినవే, గౌరిసుకుమారీ.

అనుపల్లవి —సురుచిరాలింగనముఁ బరిహృత, గురుకలుషుఁ డైతసయసుగ్రీవుని, వరదయాదృష్టిఁగని చిఱునగవున, వదన శశిశృంగార, శ్రీ మీఱఁ బరతత్త్వ మెఱిఁగిపలికితివానను ప్రాకృతు లెఱుఁగక రఘునులుఁడంద్రు । కళటులనుమాయచేత మోహితులుఁ, గాఁజేతుననిపల్కె శ్రీపతి గరుడ.

లేలెమ్మికవాలితోననికిఁ జను, కీలుగురు తెఱఁగిరిప్రుఁ ద్రుంతునని । మేలుగహరిపల్కఁసకిష్కింధకు, నిఃహీరతనయుఁ డరిగి, కెరలుచు । చాలిసింహానాదము జేసినరిపు, శబ్దము విని రోషారుణనేత్రుఁడై । వాలిరానతసియురమినజుఁడరిచె, కేల వాడిచెవాలియమునిబోలి । వ్రాలుచునోలుచు నొకరినొకరేచి, జాలప్రొద్దుబోరాడి వాలిచే। దూలిరుధిరములుగ్రక్కుచుఁజని హరి, తోసనియెగపిరాజుతోడిబడి. గరు. 1

రామాసను జంపింపఁగఁదలఁచితి, వోమాయన్నచేనటు లైనానీవే। సామీనను బొరిగొనుమనిపొగలిన, రాముఁడు కడువగచి, నేనుసఖా।యేమిసేతు మీరిద్దఱొకరూప, మైమెఱి యుటనేయక తడసితినని, సౌమిత్రి గని యితనికొకగుఱుతిడి

యీమాటుబంపు మాయనతఁడనుపము । హేమపుష్పమాలిక
యొసఁగిపనుప, ధామనిధిసుతుఁడరిగి వాలిఁబిలువ । నేమిచోద్య
మనియాజికతఁడుబో, గా మగనితోఁ దారపలికెను. గరు. 2

పోవలదుమహాత్మా ప్రాపులేకితఁడు, పోరికితిరిగివచ్చునా
యనఁగివాలి । నేవీరుఁడనై పో కునికితగదు, వేవేలువచ్చినను నే
వెఱవ । వేవేగనతనిప్రాపుతోడ, జావనడిచివత్తుననినఁగడు
చేవింటి రాముఁడడవులకువచ్చి, సీతఁగోల్పడి నేఁడరవిజునితోడ।
తావహ్నిసాక్షిగా మైత్రిఁజేసి, నేవాలినిజంపుదునని నాఁడట।
దేవదేవుఁడతని శరణమనిసుగ్రీవునిసచివుఁ జేయుమనెసతి. గరు.

రాముఁడు సాక్షాన్నారాయణుఁడై, బ్రహ్మాదిసురలు
ప్రార్థింపరఘుకుల । సోముఁడై జనించె రావణవధకు, నామహి
తునకొరులుస్వజనులు । యేమి లేరబలపొమ్మనితమ్ముని, నెదిరిపొడు
వదరువు మరువుననుండి । రాముఁడైంద్ర బాణ మేయఁబడెను,
త్రామసుతుఁడు సోలిగిరిబోలి । మైమఱపుకొంతవడికిఁదెలిసిగుణా,
ధాముధృతజటాస్తోముకువలయ । శ్యాము లక్ష్మణకపీంద్రాభి
రాము, రామునిజూచివాలిపలికెను గరు. 4

నాచేనీకపకార మేమిదిన, నాథసుతునివలన నుపకార
మేమి । రాచనడక తెలియక చేసితివి, నీచతఁజంపవచ్చునా బో
యవై । కాచిపొంచిఁదేసిన కీర్తియేమి, క్షత్రియుఁడవై తేనిన
న్నెదిర్చి చూచినయశమగుసీతకొఱకురవి, సుతుశరణము ేమి,
రామస్వామీ। నాచతురతయెఱుఁగవు రావణుసాన్వయముతో
సీతతోనిటకుఁదెత్తుఁ । దోఁచదాయెదోసమాయెనికను, దుందుభి
వైరితోన్నపుఁడనియె. గరు. 5

సకలధర్మపాలుఁడ వైచరింతు, శాసింతువిలుకాఁడ వైఖ
లులవా। రక గూఁతురుగోడలుదోఁడబుట్టువు, భ్రాతృభార్య
బలుకసరియగు। యకటానీవెఱుఁగకతమ్మునిసతి, నతిబలాత్కార
మునఁబట్టినపా। తకుని నిన్నుజంపినఁబాపములే, దనినవాలిస్రు
క్కిహరికిమ్రొక్కి। యిఁకఁదప్పులులేవు శ్రీపతివిజగ, దీశుఁడవని
తెలిసెననశేషగిరి। నికేతనుఁడుశరము బెఱుకవాలియు, నింద్య
మగు కైవల్యమొందెను. గరు. 6

4. ఘంటారాగము - ఆదితాళము.

పల్లవి —కోమలారుణ, పల్లవపాణి, కోరివినవెశార్వాణి.
అను.—భీమసంగ్రామహతుఁడైనవాలి, జేర్కొనివానరుల్ శో
కించిరి. కోమ.

తోరముగానో, గకనులబాష్ప, ధారలుభోరుననొలుక,
తారహారములురాల కిష్కింధాపురివెడలి నడుమళుక। తారవద
నవిజితరాకాతారాపతి నిజపతినిజేరి। వీరాధివీరానను బాసి
పోయి, తేరమణహా, హాయనియడలెను. కోమ. 1

రామాయేబాణముననేసితో, నామగనినాబాణమునఁ।
దామసింపకననుజంపుమనుచుఁ, దరణిసుతునిగని, కోపమున।
స్వామిదయనఖిలముగల్గెనీ, కేమిసుఖమనుభవించుమని। భామా
మణి విలపింప, రాముఁడామగువనూ, రార్చఁగడఁగెను. 2

ఊరకనేలపా గలశోకమునకు, పేరైపోయినతతికి। నారీ
నీపతి, జీవుఁడోయీశ, రీరమోనీమదికి। కోరి గుణభూతేంద్రియ
ములు, చేరికలిగె నదితనువుశ। రీరినిత్యుఁడచలుఁడెవ్వరి, కీరీతి
వగచెదవనెనుహరి. కోమ. 3

అనఘతనువుదారువువలెజడముచి, దాత్మజీవుఁడు నిత్యుఁ

డని । మొనసిపల్కితివీసుఖదుఃఖము లనుభవించువారెవ్వరని।
వనితామణి యడుగ రాఘవుఁడు, వినియహంకారాద్యను బంధ
మోఘనసంసారముజీవునకుసుఖాసుఖములజ్ఞానములనె. కోమ. 4

బలుకోర్కెలు గలవానికిరానివి, కలలోఁదోఁచు నెటు
లటులనె । తెలియనాద్యవిద్యాసంబంధముజీవికహంకృతియందు
ననె। తలపెసంసారమదియెబంధము శుద్ధస్ఫటికమున గెంపు । నిలు
వనెఱుపైనట్లు మతీంద్రియా కలననాత్మకు సంసృతియనె. కో.

జీవుఁడుమనోయుతుఁడై యదిబోవు, త్రోవబోవుచు జన్మ
మృతి । భావమొందుచుఁబుణ్యవశతనా, భక్తులసంగతిసుగతి ।
త్రోవదెలిసిమహాదాదులకు, నేవేరా బ్రహ్మమనిదలఁచు । నీవు
పూర్వసుకృతమునను సేవించి ధన్యవైతివనె హరి. కోమ. 6

నా చేఁబలుకఁబడిన ఈవిధమా, లోచననేసి సన్మతివై ।
యోచి సుఖింపుమున, రాముని నుతి, యించెఁ దారకహితవై ।
ఆచక్రిమహిసుగ్రీవుని, కానందప్రదమయ్యెనతనిఁ।జూచి వాలికి
క్రియల్ సేయు, సూచించిపంచె శ్రీరామచంద్రుఁడు. కోమ. 7

తరణిజుఁడంగదపురస్సరుఁడై జ,ప్పరమున వాలితనువుంచి।
పరేతోర్వికేగిదహనాద్యపర, కరణీయములొనరించెఁ । పరమా
హ్లాదమున రామపద, సరోజాతములుగాంచి మ్రొక్కిన । హరి
వీరులకెల్ల దొరదినక, రాత్మజుఁడు మంత్రియంగదుండనె.కోమ.

సిరియు రాజ్యము నీదె నినుసేవిం,చెద ననుసుగ్రీవుఁగని
హరి । యరయ నీవే నేను రాజవగుమని, యానతీయ లక్ష్మ
ణుఁడుపురి । త్వరతోఁజేరి సుగ్రీవునకలరిపట్టముగట్టివర్ష ఋతు।
వరుగరమ్మనిచనియె శేషగిరీశుఁ, డగు శ్రీరామునియొద్దికి. కోమ.

### ౫. యమునరాగము - రూపకతాళము.

పల్లవి.—ఫణిశయనుని చరితము విను, దాశూ। యశేభక్తజన
పరాయణి.

అను—గుణనిధులౌ దాశరథులు ప్రవ, ర్షణాచలశిఖర స్థవిలస
త్ఫలసుమ, తరు। గణావృతమై బహువర్ణమృ, గవిహగసేవి
తమైమణిఘృతమైవర్ష వాత సహమగు నొకగుహనుండిరి. ఫణి.

శ్రీనివాసుఁడు నరాకృతిఁ జేకొనినాఁడని। మానివరులు
సురలు, కరమనురాగమున। మానితఖగమృగశరీరులై సేవింతురు,
పూనియనుదినము రాముని, యహోరాత్రుల। ధ్యానమానసి
కుఁడై లక్ష్మణుఁడేకాం, తమునవికసితముఖుఁడై తగురఘుపతిని
జేరి। భానునిభానీ చేమునువిన్న బోధనేమఱచితిఁ, గానసుల
భమౌ క్రియాసంయోగము సెలవిమ్మనియెను ఫణి. 1

అనుజుఁడననుఁబూజించగ నంతము లేదైన। వినుసంక్షేప
ముగా, వినుపింతుగురుదయ। ననుపమమంత్రోపదేశమైధీమం
తుడు। మొనసిగురునిచేఁ బూజావిధి తెలిసితననుసభక్తికముగా
నారాధించి ప్రాత, స్స్నానాదికమగు నాహ్నికము। లొనర్చిశిలా
స్థాపనము జేసి, కృతసంకల్పుఁడై గంధకుసుమాదుల। నను ప్రతి
మాదిపూజసేయగవలెననె రాముఁడు. ఫణి. 2

నాసన్నిధి భక్తినేమియొసఁగిననేనందు, ననె యఱరుదు
చాలాభక్ష్యభోజ్యచందన। వాసోముఖ పూజాద్రవ్యములు
దెచ్చిసి, ద్ధాసనమున దేవునియెదుటఁగూర్చుండి లీలాభాసుర
బహిరంతరమాతృకా, న్యాసంబులు గేశవాదికముమూర్తిపం
జర। న్యాసంబులుజేసి హృదబ్జరవివిమలజీవకళాధ్యాసియై
శిలాదులకుకలాసిద్ధిఁ జేయవలెననె రాముఁడు ఫణి. 3

హృదయావరణాది పూజలాగమవిధినొన, రించియర్ఘ్య పాద్యాచమనమధుపర్కసదమలధూపదీప నైవేద్యనీరాజనాది, విదితోపచారముల నర్చించవలెనన్న నవిద్య। బొదలుచు నగ్ని ప్రతిష్ఠాపనం, బుచేసి యగస్త్యోక్తమార్గమున హోమము వేల్చి దహనుఁ దప్తసువర్ణసముగ, మణిభూషణుగవిష్ణు। పదస్థితుగా బుధుల్ సదాభావింతురనెనుహరి. ఫణి. 4

బలిపార్షదులకునిడినమంత్రజ, పము జేసి చెలఁగివిడెమిచ్చి నృత్యగీతవాద్యము। లలరగనాముందరస్వస్తివచనాదులు, సలిపి నాప్రసాదము శిరసావహించిహెచ్చి। లలిదండమర్పించి కర యుగళినాపాద, జలజంబులుస్పృశించితలనుంచి మహాసంసృతి, వలన బ్రోవుమనియు ధ్యానమును చేయునతఁడిహపర, ములొం దునని శేషగిరినిలయుఁడనుజన్మునకుఁ దెలిపె. ఫణి. 5

6. పంతువరాళి - అటతాళము.

పల్లవి.—కలికియలరులముఁలికిచిలుకల, కొలికివీనులసుధ జిలికి కథవినవే.

అనుపల్లవి.—చెలఁగిలక్ష్మణదేవుని దెలిపిప్రాకృతునివలెమాయ। యలవడహాసీతా, యనినిద్ర జెందఁడాయెనుహరి. కలికి.

అచటకిష్కింధాపురిలోహనుమంతుఁ, డతినీతిమంతుఁ డగచరేంద్రుఁడగుసుగ్రీవునిచేరి రాజా। ప్రచురతధనరాజ్యములఁ గొని, రామచంద్రు మహానుభావునిమఱచినావు। ఖచరపతి సుతుఁడు తెగినగతిచెడక రాఘవునిజేరుము। విచికిత్సవలదనిన విభుఁడు బిలుపింపుమనెగపులను. కలికి. 1

అంజనాసుతుఁడధిపునియాజ్ఞ వానరులరాఁబనిచిననఖిల దిక్కులు బిక్కటిల్లఁగపివీరులు। మంజుతరగిరినిభశరీరులు, మహి

యునాకసము భేదిల్లవచ్చిరంతట। గంజదళనేత్రుఁడై తగు కాకుత్
స్థకులుఁడచలమునమణి। పుంజసానుస్థితుఁడై పొరలెసీతావిరహా
ర్తిచే. కలికి. 2

జానకీవాఁచంద్రముఖి, ప్రాణములునీ మేననిలిచిన। వేన
న్ను బాసియించాకచల్లనై మా, మానవతినంటినీకరముల మఱి
నన్ను దాకుమీ రాకాసుధాకర। భానుసముఁడాయెఁజంద్రుఁడు,
పరికింపు లక్ష్మణాయిదివఱ। కేణాక్షి, దనుజుచేఁబడి, యెటు
లొంటరయెఱుఁగ ననెరాముఁడు. కలికి. 3

స్త్రీసక్తుఁడై పానమదచేష్టనిటు రాఁడుసు, గ్రీవుని ద్రుంతు
నని రాఘవుఁడు దోడరననుబంపుతీ। వ్రాసిహాతునిగఁజేతు నిన
సుతునని యనుజుఁ, డలుగ హరికదురాయిడిసేయఁదగ। వాసౌ
మిత్రినీవు చని వాలి, వలె జెడకుమనుమిఁకదడ। జేసినఁజెడు
ననిన దవ, శిఖికరణికపిపురికినతఁడరిగెను. కలికి. 4

విలుగుణధ్వనిచేయఁగ, విని యంగదుఁడువచ్చిమ్రొక్కిన,
వేగ మీదొరకుమారాక దెల్పుమనఁజని। కలఁగిపురివాఁకిట
నిలిచెలక్ష్మణుఁడు, కపిరాజాపరాకాయనసుగ్రీవుఁడు। దెలిసి
మారుతి నీవలుక, దీర్చి యాఘునుని దెమ్మనఁజని। వలగొనికినుక
వత్సలాను, జావలదని. తోడితెచ్చెను కలికి. 5

పతిపనుపదారాంగనచని, భయభక్తివినయ సంభ్రమ
ముల। నతిజేసికుశలమేబావా, కోపమేమిరా। అతిభీతుఁడై వారి
విభఁడున, న్నని చెమిము దేరరా దేవా యనిచెయిబట్టి సతియం
తఃపురికితోడ్తేర నతనిగనుఁగొని కపి। పతిరుమాయుతుఁడై పా
న్పునుండి యులికి, పడిలేచెవెఱపరివలె. కలికి. 6

మదలోల లోచనుఁడై, మలయు రవిసుతుఁ గనియలిగి

ర్యా,మానుజుఁడువలికె సుగ్రీవా చేసిన మేలు। పదటఁగలిపిరుమా వధూరతి, పరవశతమఱచియున్నా వా కాని వాలిని । పదరి ప్రాణము, లుగొన్న శిత, ప్రదర మెదు రెదురు జూచుచున్న దనిన రామ కార్యము, నఘయితఁడు మఱువఁడ నేఁబావని. కలికి.

వానరులని దెచూడు డెబ్బది రెండు వే, ల్వాలనుగూడుక, భానుజుఁడు రాఁదలఁచినాఁడు అని పలికినపవ । మానసుతుచతురో క్షులగతా, మర్ష తనున్న రా కొమరు వేఁడుకొని। భానుజుఁడు పూని వందనము జేసిన, వానిఁగౌఁగిటనిడి యుర్మిళా । జాని యాసీనుఁడయి సరసపూ, జలుగొనె సఖుని చే. కలికి. 8

రామదర్శనలాలసుఁడయిరథ మెక్కి, లక్ష్మణకపీంద్రులు రణభే । రీమృదంగములుఖొదలఁగాఁగదలిహా, న్మామస్నిలాంగ దనలాది । భూమిరుహచరపతులు గు, ములుగొనికొల్వఁగాఁ। జామరసి తాతపత్ర, సద్విభవయుతులై శేషగిరి । ధాముఁడయి రఘుకులాబ్ధి సోముఁడగు, రామవిభుఁ జేరిరి. కలికి. 9

## 7. కాంభోజిరాగము - అటతాళము.

పల్లవి.—రామాభిరామ గుణధామ, రామ కథాసుధామా, ధురి సామాన్యమా.

అనుపల్లవి —రామునకనతిదూర మే తేరుడిగివచ్చి, సౌమిత్రిరవి, సుతులు, జేసిరినతులు, స్వామికౌఁగిటనిడియర్హావూ, జామాన్యుఁజేయ, హరిపతిహరి । వామభాగాసీనుఁడయిరఘు, రామనృపయిటుజూడువచ్చెఁ। కామరూపులనగణితులఁగపులజితరిపులననె విను. రామా.

మేరుమందరహిమవ, త్పారియాత్రాదిగిరులఁ జేరియుండెడివీరులు, దేవాంశభవులు । భూరిశైలాకారులు, రణోదారు

లు, సారకరిబలులులు, దశశతసహస్రాయుతులువి । స్తారవారణ
సత్వులు నిస్తులులు, చారుసౌవర్ణతనులమలశ । రీరులగణింగులు
వినీలా । కారులిదెగర్జలిడిపరువిడ కడఁగినీపనికిప్రాణములీఁ,గోరి
నారిఁకవీరు మీయాజ్ఞావశులభిజ్ఞాయను. రామా. 1

గోనకోనిభల్లూక, కోట్లుగొల్వఁగఁదగునీ । గుణనిధిజాం
బవంతుఁ, డునితఁ డుపవన । తనయుఁడు హనుమంతుఁడు, నల
నీలతార । పనసగజగవయగ, వాక్షగంధమా । దనసుషేణదధి
ముఖులు కేసరిప్రముఖులు । వినుమితఁడు, శతబలిదశరథుఁడితఁ
డనఘు వాలికొడుకంగదుఁడితఁ । డనుపమానబలాఢ్యులనుపని
గొనుమనిన, నినతనయునాలిం । గనముచేసినమోదాశ్రు లో
చనుఁడయిహరిబలికెఘనుఁడయి. రామా. 2

ధరణిజవెదకవా, నరులంబంపుమునీ, వెలుఁగవాకా
ర్యసరణి, యనిపలికినదా । శరధియానతిఁ దరణిసుతుఁడగ, చ
రుల । హరిదంతములకనిచెనవనిజ, సడినెలలో నెఱిఁగింపకున్న
వారిద్రుంతునని ఖేరి । నొరయించియంగదజాంబవ, ద్వినుతహ
నుమన్నలసుషేణుల । శరభమైందద్వివిదులననిచె, సరసదక్షిణ
దిశకనిలజుని, హరిబిలిచిముద్రికసీతకొసఁ, గుమనిదొసఁగెఁ
బొసఁగ. రామా. 3

శ్రీరామునిచే నా, శీర్వాదములుగాంచి, మారుతిము
ఖ్యులరిగి । గిరిసరిత్కుంజభూధరదుర్గముల్దిరిగి, వింధ్యాటవి ।
నీరువట్టునడస్సినీరపతులుగు, హద్వారము వెడలిరాఁగాఁ, గనిబి
లములోగా । హేరేగిసింహాసనస్థలి, వరనియతినున్న యోగిని
గని । కోరిమ్రొక్కిన మీరెవ రనుచుఁ జెలియడుగ । గా

రామదూతలమన వారిఫలములుగొనఁగ సెలవిచ్చె సతిమదిని
మెచ్చె. రామా. 4

జలఫలతృప్తులై, లలననీవెవరనిన। నలవిశ్వకర్మతన,యను
హేమయందురునను। తొలుతనాట్యమునంద్రి, నయను మెప్పిం
చిన। లలితసద్వస్తుని, స్తుతమగానీపురమిచ్చె। నలికాతుఁ
డదిమొదలీగతినుందుపొదలి। యలఘుమతులారయనివారల,
ననిచితాఁబోయి శేషాచల। నిలయుఁడగురఘువరుపదాంబుజ,
ములకెఱఁగి శ్రుతిసూక్తినతినుతి। సలిపిచెలిబదరి, కాశ్రమము
ననుగైవల్యమొందెను. రామా. 5

8. గౌరీరాగము - ఆదితాళము.

పల్లవి.—ఇందిరారమణుచరితమువినవే, సుందరీమణి.

అను.—మందయానమునఁజనికపులువ్రాని। క్రిందనానీనులై
యెటుబోదము। ఎందరయుదముసీతననినవాలి। నందనుఁడను
జనకాత్మజనుగన్గొనక। యందరిగితిమేనిననుజంపు, ముందు
గారమూజానినే। నిందుమృతినొందువాఁడనననందు, కొంద
ఱిందెయుంద మెందుకుమృతియనిరి ఇంది.

రామబాణమునకభేద్యముజగ, త్త్రయమునందుఁ, గల
డాచిఱుతయిట్లను। ఏమితెలివివలదా, గుహానుందమును నో
మరులనుడివినకు రాఘువునకు। సౌమిత్రికన్న నీమీఁదఁబ్రేమ,
చాలగలదింకొక రహస్యము। రాముఁడనఁగనారాయణుఁడు
సీత, శ్రీమహాలక్ష్మణుఁడాదిశేషుఁడు। స్వామిపార్షదులము మన
మును, వైకుంఠనివాసులముహరి। భూమిభరముమాన్పదా
శరథియై, పుట్టెననిదెలిపెనంగదునకుఁ బావని నిం. 1

మనమురామ కార్యనిర్వాహకుల, మయినశుభముఁగలు

గుననినసందరీ । ఘనునిబుద్ధిమెలఁగుచే మేలనిచని, చనిమహేం
ద్రాచలమెక్కితరుచరుల్ । ఘనమకరకమఠ, కర్కటజలూక ।
ఫణితిమితిమింగిలాదిజలచరా, భంగమైతరంగాలింగితస్వర్గంగా ।
మనోజ్ఞాంగవల్లియైతనరు, వనధిఁజూచిభీతిల్లియది । మనముదాఁ
టుచేడ రావణుఁడేడ, ననుచుఁ బ్రాయోపవేశపరులై రపుడు. 2

గిరిగుహ వెలువడిసంపాతియనుఖ, గేంద్రుఁడువానరులఁ
గనిపారిఁగొందు । నిరతముఁదిందుకరులవలెనున్నారని, పరువిడి
రాదుర్మృతిభీతిప్లవగుల్ హరి । హరిజటాయువెంతసుకృతియై
మరణమొందెననహరిసంపాతిసహో । దరునిమృతిదెలియవిని
హరి, వరులచ్చటికివచ్చుటయు నెఱిఁగివారునుజలధికిరా । నరి
గితమ్మునకుఁదిలోదకములిడి మరలునతనిసీత, సడియడిగిరగచ
రు. లింది. 3

నగశిఖరమెక్కినిక్కిలంకలో, నశోకవనినవనిసుతగంటి
నిదె । మొగమాటముగాదనిపల్కిసంపాతి, తగనిట్లనునాత్మ
నిజంపిన । పగదీరరావణునిద్రుంతు, పక్షయుగములేకునికి నెగ
రలేను చిన్ననాఁడో మహాత్ములార, పంతముమీఱఁగ । నొగి
జటాయునేనురవిమండ, లోన్నతంబెగురగాను అరు, ణగభ
స్తిదీప్తిచే ఱెక్కలవిసి, పొగరడఁగి పడితినతఁడు వడుకెఱుఁగ
ననె. నింది. 4

ప్రాణములుమూఁడుదినములకువచ్చి, పరగశేషశైల,వా
సునిదయ । నేనుదెలివొందిచాలావగనొముఁదఁ । మానిఁజే
రఁజని మ్రొక్కినఁగనిసంపాతినీకీవిరూపమెటువచ్చె । మేనుగృశిం
చుటేమనినజగతిలోమీఱెఱుఁగని దేమిసంయమిస్వామి । నై
నవినుమనిమదీయచేష్టిత, మంతయుఁదెలుపవినికడ । లేనియడ

లూనియున్న నన్నూరడించమునిదలఁచెననేఁగపులకుఖగపతి యింది. 5

9. పూరిరాగము - ఆదితాళము.

పల్లవి.—వినవె రామచరిత్రము, దాక్షాయణీ, వినవె.

అను —మునిచంద్రుఁడౌచంద్రముఁడు, తనుదెల్పురీతిసంపాతి। యనియెఁగపులతో శోకమూలమిా, తనువుతనుకారణము కర్మమనుచు.

నేను దేహిననేబుద్ధి, చేతపురుషునికర్మమును అహామవిద్యవల్ల। నౌనుకాఁగినయినుమువలెఁదాను, మాయాయుతుఁడై వెలి। లోనుగుణమయమైయిా, మేనునేననిభ్రమసి। తేను తెలివిమట్టౌను, దానసంసారమాయా తానా అవికారిదురభి। మానమునఁగర్మములు జేసిఫలా, ధీనుఁడగుచుఁ జెడితిరుగుజీవుఁడనె. వినవె. 1

యాగాదులు జేసిస్వర్గ, భోగమొందియాఫలము। బోగాభువిపైఁబడినరుఁడు, బాగాచతుర్విధభోజనస। రాగస్త్రీపురుషసం, యోగమునరేతోమయుఁడై వేగమె స్త్రీ గర్భము, లోగాఁజొచ్చినెత్తుటఁ।దోఁగియొకనాటకలల, వైగట్టియైయైదునా। ళ్లేఁగబుగ్గవలెనైపదియవదినము, రాగమాంసపేశియాననితెలివె. వినవె. 2

పదియేనహాములకామాంసపు, పొదినెత్తుటజొత్తిల్లునం దదయంతరమిఱువైరైు, దుదినమ్ములకుప్పతిల్లునెల। మొదలుతలమెడమూఁపువీఁపు, నుదరమివిర్రైయైదుబొడముకర। పద పార్శ్వకటిజానూరువు, లుదుకైయొసఁగురెన్నెలలాముదితగర్భిణికోర్కె, విదితమకామూఁడవనెలను। పొదలనంగసంధులఖ

లాంగుళము, లుదయమౌ నాల్గునెలలకనిపలికె. వినవె. 3.

తెలిగన్నులుముక్కుఁజెవులుబలు, దిన్నెలచాలునఖము
లైదవ । నెలగల్గునాఱవనెలనుగర్ణ, బిలగుహ్యగుదములుపొ।
క్కిలియొదవురోమ, ములును బెన్నెరులందముగను । మొలచు
నాఱునునొక్కటొ, నెలను ఎనిమిదవనెలను । లలితావయవో
జ్జ్వలమౌన, స్ఖలితజ్ఞానియైజీవుఁ డలరిమాతృభుక్తసారమైదవ,
నెలమొదల్ సచేతనుఁడై కొనునవె. వినవె. 4.

నానాయోనులజన్మించి, నేనాలుఁబిడ్డలకై । హీనవృత్తి
కిఁజొచ్చి, యైనాకుటుంబభరణమం । దేనామది సిల్పెఁగలలో,
నైనాహరినిదలఁచనైతి।గాన ననుభవించెద, నీనారీగర్భనరక
ము।నేనుతొలఁగినమఱచిపోను హరినసిశిశువు మేనుకదలివెడలు
మాతృగర్భము । లోనుండి పదోనెలహరిదయననె. వినవె. 5

తానుబ్రహ్మానందాద్వయ, ఘనతత్త్వబోధాత్ముఁగా ।
దనుతా నెఱిఁగిననజ్ఞాన, జనితమగుమోహమడఁగును । విను
తాపత్రామదినిదిచే, కొనితాలిమిఁజెందుమనె మౌని । యని
శాఖగపతివానరులఁ, గని తద్దయుమ్రొక్కి తెక్క । లనువారవ
చ్చెశేషాద్రినివాసునిదలఁచినగ్ర । క్కునభవాబ్ధిఖలుఁడయిన
దాఁటుభ, క్తులగుమీకీవనధియెంతనిచనె. వినవె. 6

## 10. ముఖారిరాగము - అటతాళము.

పల్లవి.—శౌరిశ్రీగౌరిభవ్యచరిత్రము వినవె.

అను—వారినిధి వానరముఖ్యులు, చేరిదాఁటుదారిగానక । తా
రియొకరొకరి మొగములు, సారెకుఁజూచుకొనుచుదైన్యము
దేరనున్నవనౌకసులఁగని, తారకొమరుఁడుబలికెనలవేర్పడఁ
గ. శౌరి.

కడలియిందెవ్వఁడు, గడచిసీతనుగనిరాఁ, గలవాఁడు మాకెల్ల। గడుప్రాణబంధుఁడా, ఘనుఁడెరక్షకుఁడు రాఘవసుగ్రీవునకెలమిజెల్ల । తడవువలదుమీామీాబలములు, నుడువుఁడన వుడుమోదమునఁగపు। లుడుగకపదిమొదలుదొంబది, యోజనములదనుకమేమీా । జడధిదాఁటఁగఁగలమనినవిని, జాంబవంతుఁడుయువరాజుతోఁబలికె. కోరి. 1

మునుత్రివిక్రమదే, వునకు మున్యేడుమా, ర్లొనరఁ । బ్రదక్షిణములు । నొనరించినానిప్పు, డొదవెవార్ధకముదాటను జాలశతయోజనములు। అనినవాలితనయుఁ, డంబుధిదాఁటిచని నరాఁగలనోరా లేనోయనెను । అనఘునిను బొమ్మనఁదగునేమమ్మంపఁదగుదీవురాజ । వని ఋక్షపతి పలికె నంగదుఁ, డంతఁ బ్రామోపవేశముసుఖమునెను. కోరి. 2

బలవంతుహనుమంతుఁ బ్రస్తుతింత మితఁడు, గలుగఁజింతిల నేటికిఁ।జలధిదాఁటి యాజానకినిజూచిరా, గలఁడనిడాసి మున్మాటికిఁ। దెలిసినిన్నెన్నఁ, దరమేమముగా, వలసిపొమ్మనిల తనయ, పవనుఁడె । చెలఁగితోడగునీకనుచునా, శీర్వాదముఁలె నసిజేసి । యలరించ బ్రహ్మపుత్రునిగని, యాంజనేయుఁడు త్రివిక్రమువలెఁ బ్రబలె. కోరి. 3

మారుతిబ్రహ్మాండమగలనార్పి పలికె, నీరధియుత్తరించి। ఆరావణునిఁ ద్రుంచి, యవనిజఁదెత్తునో, ధీరులార మేలెంచి । ఆ రాక్షసపతిఁగట్టిలంకతో, నేరామునిసన్నిధికిఁదెత్తునోత్వరఁగాఁ। జేరిత్రిజగన్మాతయైన, సీతనుజూచిరానోయనపుడు । పౌరుషము మీాఁదనగునవనిజఁ, బరికించిరమ్మనిరికపులందఱును. కోరి. 4

తుహినాద్రిసముఁడత్యు, ద్భుతస్వర్ణ వర్ణుఁడు మహితా

రుణాననుఁడు । అహికులసార్వభౌ, మాభదీర్ఘవాలుఁ, డనుప
మసుయశోవిశాలుఁడు । అహితాంతకుఁడో, హనుమంతుఁడో
ప్పైనా, మహేంద్రాచలమస్తకమునఁజూడ। రహిమీఱశ్రీమద
ధ్యాత్మ రామాయణమున కిష్కింధ కాండము । బహుళార్థము
తెనిఁగించెసు, బ్రహ్మణ్యకవి శేషగిరిపతిపేర. కోరి. 5.

కిష్కింధాకాండము - సంపూర్ణము.

శ్రీరస్తు.

# శ్రీమదధ్యాత్మరామాయణకీర్తనలు

## సుందరకాండము.

### 1. సౌరాష్ట్రరాగము - ఆదితాళము.

---

పల్లవి—శ్రీరజతాద్రిసదనా వేడుకొనెనే, పాద్రీశుచరిత్ర వినవిన.

అను.—మారుతిసాగరము, శతయోజన, దూరమొకనిబ్బర
మునదాటెఁగఁ । గోరియానందకందళితుఁడయి, శ్రీరాముని
భజియించికపులఁగాంచి । కూరిమివనచరులారా, కనుఁ,
గొనుఁడీ నన్ను లంకఁజేర । భూరివేగమునఁజనిజానికిఁగని,
మాసఁగవత్తు యశము దెత్తుమీకనియెను. శ్రీర.

నేఁడుధన్యుఁడనుధన్యుఁడహరిపద, నీరజములమరలఁగందు
నెవ్వఁ । డైనామృతికాలమందు, రాముని, శ్రీనామస్మరణనొం
దుభవాం । భోనిధిఁ బుడిసిటియందు, నడచి, మానితముగఁ
బరమపదమాఘనుఁడు । తానొందు శ్రీజానిదూత నతనిముద్రిక
చేఁ, బూనితిరఘుపతినినెమ్మదిలో । ధ్యానించుననువాయిజడ
ధి, దాఁటెదననిహనుమంతుఁ, డరికృతాంతుఁడు । పూనిబాహు
వులుజాఁచిమెడపొడవుగనిక్కించిమీఁదుజూచి। మేనువంచితోఁ
కబెంచిపాదములూనియెగసెవాని పొగ రేమిజెప్పుదు. శ్రీర. 1

పోవుచున్న పవనాత్మజుబలమును, రావలిజూడఁదలంచి
సురసా । దేవికి నుపదేశించిపంచిన, పావనినదియెదిరించి పెరిగిన।

నావీరుఁడురెట్టించి ప్రబలె । నావెలదిమఱియుబలియసూక్ష్మతనుఁ
దై పొంచి।యాదేవికడుపుజొచ్చి వెడలిననగ, ధీరునిగని మెచ్చి
జయమగునని । తావచ్చుటసతిదెల్పిజనెనతఁ, డావలఁబోవమై
నాకగిరిడగ్గరి । రావయ్యాహనుమంతానీ । రధిపని చెనాయందు
సుంత । నీవువిశ్రమించిపొమ్మననిలక, నేప్పృశించినేప్పమిం । చి
పోఁదొడఁగెను. శ్రీ. 2

ఎదుటనుసింహిక యనురాక్షసిప్లవ. గేంద్రుమైనీడ
ద్రింగి, త్రోవ।గుదియించనతఁడెఱింగితనఘన, పదమునఁదన్నిన
గ్రుంగిగెడసె । నదిగనగరుడుని, భంగిసభమున, బొదలుచు
హరిపతియుదధిదాఁటెనుబొంగికడు । ముదమునను సువేలాచల
మెక్కియ, ద్భుతమతియై శ్రీలదనరిమణి । సదనగోపుర ప్రాకార
సౌధో, జ్జ్వలమహా దానిలంకా రాజధాని । కుదుసు గని మెచ్చు
చుండగరవి, గ్రుంకెదన్వారులెఱుఁగకుండ । కదసెవాయుజుఁ
డణుమాత్రుఁడయిలం, కాపురంబుగోపురంబు జేరినిలిచె. శ్రీ 3

లంకిణియనురాక్షసి యనిలజుఁగని, లావుమెఱిపిపో
నీకయోరి।కొంకుకొసరుఇంత లేక, పోయెదు, లంకిణినను గైకొనక
వానరా । యింకనైనజెడిపోక, యెవఁడవు, మంకుతనముమాని
కలరూపుచెప్పుమని । ఝంకకనరచేతనదియడచిన, సామీరి
యుభూతతతిబెదరఁగాఁ । బొంకపుపిడికిటఁదానిఁబొడిచిన, భువిఁ
బడిరక్తముగ్రక్కుచుముక్కుచురామ।కింకర నతిసీపాదములకి
దెచెడు,లంకయింకమీఁదఁ। బంకజాసనునివాక్యమదెయనుచుఁ,
బడఁతి రామకథవిరామమిడక దెలిపె. శ్రీ. 4

రావణునంతగపురమునఁ గ్రీడా, రణ్యమున నున్నది
సీత, రాముని । పావనస్మృతి సంజాత, మాయెనా శీవఱకు

సుకృతముచేత నినుగంటి । శ్రీవరభక్తవ్రాతా, గ్రణినీ, సేవగ
లైనేధన్యనోజయశ్రీసమేత, రామ । భూవిభుఁడునామదిరంజిల్లు
గా,కేవేళననిమదినిదివికదిజనె । నావారధియంజనీసుతుఁడుదాఁ
టి, నప్పుడుధరాసుతకునాదశగ్రీవునకు । శ్రీవిలయకారణములై
యదరె, వామభుజాక్షులుద్రవములై । వేవిధముల శుభ
సూచకమైరఘు, వీరుదక్షిణోరుక్షణమెయదరెను. శ్రీరజ. 5

2. కేదారగౌళరాగము - అటతాళము.

పల్లవి.—నలిననయనుకథాసుధనప । ర్ణా, కర్ణాంజలులఁగ్రోలవే
అను.—బలియుఁడగుననిలతనయుఁడా, వలలంకలోఁజొచ్చి ।
యిలాసుతవిలాసతనువల్లి, నెల్లచోనరయుచుఁడిరిగెఁబురి.నలి.

రావణునంతిపు, రమునకేగిజనక, భూవరాత్మజనందు, శోధించివిసువక । దేవకిన్నరమరున్నాగ, స్త్రీలుచెరనున్నకడనా రసియందుఁ । భావనీత్రిలోక, పావనిన్నృప, దేవిగానకలంకిణీ వాక్యముదలంచిజనెరమణీయమగు నశోకవనమునకు నలిన. 1

రతనంపుమెటికల, రంగైన బావులు, రాజిల్లువిరితా వులు, దేవతాశాఖి । తతులనతులముగ, జతలగుఖగ, రుతము లకలరులేడి । పిల్లలతీవులు, అతిమృదులమధురఫలభరన, వ్రా వనిజశాఖాలం । కృతస్థలులగ, నిమారుతియు, ద్భుతమతివెదకె తితిసుతనచట. నలిన. 2

అందమైమహ్రాదయా, నందమైవనలక్ష్మిచందమైఘనమై త్రిగలసుకృతిగతిమి । న్నందిశతశాతకుంభస్తం, భాన్వితంబగు మేడగనిభూపుత్రి । అందులేకున్నఁబోయి మరున్నందనుఁడు తిలకించె । ముందరనుశింశుపావృక్షము, మొదటసీతనులోక మాతను। నలి. 3

దనుజాంగనలమ । ధ్యముననున్నదానిశ్రీ - తరుణివలె
నొప్పుదాని, దీనతయుజడగ । ట్టినకురులునుపవాసములఁగ్రు, స్సి
నమేనుమాసినచీరెగలదాని । తనుగావవిభుఁడురామికినెం,తయు
వగఁగన్గవనుజడిగొనుబాష్ప । కణములదాని రామునినుడువు,
పడఁతిగనెఁగపిపతి. నలిన. 4

అవనిజగంటిఁగృతార్థుఁడనైతిరా - ఘువుపనినాచేతను,
సాధింపఁబడెనని । భువికిదిగుతఱినగరివెలుపలఁ - బుట్టినొక
కలకలమది, యుఁగనినేను।రవికులునిసతినలరింతునని, పవమాన
సుతుఁడుండెఁ । బవళించిరావణుఁడుకలరఘు, పతిభటునివాన
రుఁగనిలేచె. నలిన. 5

ఇదిదుస్స్వప్నమని, క్రీడావనికిదశ, వదనుఁడురాకాంత
శత । పదకటకములరొదలువినినిశిచర, పతిగనిబలుదిగులునవడఁ
గితలవంచుకచింతా । పదమైనమదిశేషశిఖరి, సదనుఁడా రాము
ని । గదియించి చిత్తరుప్రతిమవలెఁ, గదలకిట్లుండెనళికికలికి.
నలిన. 6

3. బేగడరాగము - ఝంపాతాళము.

పల్లవి.—వింటివానీరేజ, పాణివాణీ, వినుతగీర్వాణీభవానీ.

అను.—తుంటవిల్తునిబారి, తారిసురవైరి, తుదిదైవమాడింప
వైదేహిజారివా । ల్గంటిరోయింకమీఁద, దయరా,దాలలి
తమగునీకటాక్షవీక్షణముననన్ను । గంటివాపట్టంపురాణిఁజే
తువరింపు, దంటతనమేలనే, బాలతాళఁజాలననె. వింటి.

పేదమానవువిరా, ఘువునినమ్మి యతఁ, డేదిక్కునితలం
చెదవునీ । బోధకేమందు విభుఁడిందు । రాఁదలఁచినావే
మోగాని కపులగుములందు । సాధ్వైన్నృపుఁడున్నాఁడనివిన్నా,

సత్వహీను నభిమానహీనుని గుణహీను । నాదరింపకునీవుము
నుపటివలెనెంచినావు, లేదనితలఁపబలనను బొందుమనెరావ
ణుఁడు. వింటి. 1

దశముఖునిపలుకువిని సీత బలికెఁ దృణమంతరువుగాఁ
గొనికినుకచేత । దశరథసుతునకళికి, కాదా, యొక బీదతపసివై
కన్నొఱఁగి, ననుదెచ్చుటక్రవ్యాద । పసహావిస్సుకుక్క గొనులె
క్క, వెసననుభవింతువాఫలంబురామబాణ । విశకలాంగుఁడ
వైలయమొందు తఱినృపాల, శశినెఱఁగెదవుదధిదాఁటివచ్చి
పొగరడఁచుననె. వింటి. 2

పిడుగుల కన్నకడిదిగాను మాటలను పడఁతినసిగొనివ్రే
యఁబూను । దుడుకురక్కసులదొర, నెదిరిమందోదరి తొగలేని
చెలులు పదువేవురున్నారుమఱి । గడసరియిదిమనుజాం, గన
దనుజా, గ్రణిదీనిపైఁ బ్రేమమానిపోదమురమ్మ । నుదుద్విమాస
ముల నాపొందొల్ల దేనిలలన, యొడలుశావలివాదుతినుఁడని
చనిరొ రావణుఁడు, వింటి. 3

అవనిజనుస్వతర్జనముల బెదరించి, రసురాంగనలుబహు
విధముల । సవినయముపల్కుఁడీ సతికిరఘుపతికి, జయమైరావ
తమునెక్కి, రామలక్ష్మణులిచ్చటికివచ్చి । తవిలిలంకఁగాల్చి,
యరిగూల్చిధరణిజనుగొనియయోధ్యఁ జేరఁగఁగలగంటి । వివ
సనుండై తైలమంటుకగుంటఁగూల, వింశతిభుజుఁగంటినిదితప్ప
దని త్రిజటపలికె. వింటి. 4

లంకవిభీషణుఁడేల, గంటిజానకిరామాంకముననుండఁ
గలఁ గంటి । నింకభూసుతకువలగొనుఁడీ మేలనుఁడీయింతినుడి
విని మ్రొక్కి, చెలులునిద్రించిరలజడి । పంకజాక్షిసీత శ్రమచేత

వడియెలుంగెత్తి యేడ్చె ఘుంటారవంబునఁ । గొంకకీతరి శేషగిరిరాముఁ డభిలాష, గొనిరాని దేమితనువనిత్యజించనూహించెను. చింటి. 5

### 4. నాటకురంజిరాగము - ఆదితాళము.

పల్లవి.—వినురఘువరచరి, తముపార్వతీ, వినుతమేచకా. కృతీ.

అను.—హనుమంతుఁడు జానకితో భాషింపంగ, ననువాతఁటి యిదియనితాఁబలికెను. విను.

మనువంశ్యుఁడు దశరథుఁడనునృపుఁడిలఁ, దనరునాదొర, కునల్వురు । తనయులు రామలక్ష్మణభరతశత్రుఘ్నులనువారలు రాముఁడగ్రజుఁడానల్వురకు । జనకాజ్ఞ నడవి కేఁగి సీతాలక్ష్మణులతోఁ బంచవటినుండ రావణుఁడుసీత । నినకులులనువంచించి, కొని, చనె వెదకి జటాయువుగాంచి । జనపతిఁజూడనిన్ను సుగ్రీవుచెలిమిగని వాలినిగీటడంచెన నెమారుతి, విను. 1

వైదేహినరయ, నాల్గుదిక్కులకు, వానరులను, బంపఁ గొందరము । ఈదెస వెదకఁగ, వచ్చితిమందు నే, నీవారధిదాఁటి లంకఁజొచ్చి తిలకింప । నాదు భాగ్యరమయననశోకవని నవ్య శింశుపా, తరువుక్రిందనాతల్లి । నీదేవతామతల్లిఁ, దనునిందిత హైరణ్మయవల్లి । నే దర్శించితిసీతనను మాట, మేదినీసుతవిని మహాద్భుత మొందె నెద. విను. 2

మిన్ను వ్రాఁతయో, పవనునిపలుకో, కన్నకలయో, నేను రామకథ । యెన్నాళ్లకు వింటిఁగర్ణామృతముగ, నెన్నఁడు నిద్ర లేదు, కలగాదు,సత్యమై తేను।కన్నులయెదుట ప్రసన్నుఁడౌ గాకనిన, వ్రాను దిగివచ్చిసీతకు మ్రొక్కె । పిన్న పిచ్చుకంతటి వాఁడై విన, తారుణముఖుఁడై యచటివా। రెన్న నంజనీసుతుఁడ

శేషాచలేశుఁడైనరామునిదూతనేననెను. విను. 3

2. శహానరాగము - త్రిపుటతాళము.

పల్లవి — వినవేయాననజితచంద్రబింబ, హేరంబ జననివరసరస
గుణమణినికురుంబ.

అను. — జనకసుతచిఱుతతనువొందిన హనుమం । తునిగనిరావ
ణునిమాయలనిబలుకకయుండె. వినవే.

తల్లి నేమాయకుఁడగానానంద వల్లిగుణములపాలవెల్లి ।
నాయందరమరలుమానుమిఁకనునింతసేయఁ । జెల్లు, నాకోసల
పురీధాముఁడైతగు, నల్లశ్రీరామదాసుఁడను మారుతసుతుఁడ ।
నల్ల,సుగ్రీవుని మంత్రిని నేను । కల్లగాదంచునంజలియొనరించు,
కపిఁ జూచి నరవానరుల కెట్లుపొందగుననె సీత. వినవే. 1

మాయమ్మారావణుఁడునిన్ గొనిచనిన, చాయవెద
కుచునృపుఁడు । బోయ, చెలిచేసీతెఱఁగువినిపంపకడన్వసింప ।
రాయ, బారమంపెనను సుగ్రీవుఁడచటికి, బ్రహ్మచారినై చని
వారలయభి । ప్రాయమెఱిఁగి శాఖామృగులఁదెచ్చితి । ఆయెనర
వానరేంద్రులకు చెలిమిఖలుఁ, డౌ వాలినిరాఘవుఁ డుజంపెననె
నంజనీసుతుఁడు. వినవే. 2

మాతనిన్నారయఁగపులఁబంచి నీచేత, నన్నియునగును
వాతాత్మజమనలక్ష్మణులమేలునాసేమముదెల్పి । సీతా, సతికిమ్ము
ముద్దుటుంగరమని హరియొసఁగెఁ, జేకొని । ప్రయత్నమునఁదె
చ్చితి, నృపతి । చేతిముద్రికయనిసీతకతఁడిచ్చెను । ప్రీతిచేఁ
గొనిశేషాద్రీశుఁ డౌ, రామవిభునామాంగుళీయక మాదలఁ
దాల్చెను సీత. వినవే. 3

6. యదుకులకాంభోజిరాగము - అటతాళము.

పల్లవి.—రామదాసుఁడవౌ నీవు హనుమంతా, రావయ్యా యనేకాంతా.

అను.—క్షేమమాసూర్యవంశాంబుధిపూర్ణ । సోముఁడైన శ్రీ రాముఁడు, ఆలక్ష్మణుఁడు. రామ.

ప్రాణదాతవుజగ, త్ప్రాణకుమారా భూనుతవిహార పుణ్యవిచార । మానితకల్యాణక్షోణీధరాకార మహితానంద సారా । కంటివానాయిడుములు, భూనాథునిదయ, రానాఁపునవి పవమానాత్మజదెలుపు । మానాడు నేనాడినమాటల, కలగవ లదనినామఱఁదితో । భానుసన్నిభునితోఁ దెలుపుము, పరమ ధార్మికతధారుణి, విలసిల్లుము. రామ. 1

గడువురెన్నెలలదాఁ, కాహరిరాకున్న, చెడుగురాక్ష సులుభక్షింతురునన్ను ఆ । రడి సేయు రావణుని, మడియించి, జయముగొన్న । కడుకీర్తియనవన్న, పతితోఁదడవువలదని । నుడువుకరితుంగమడువుఁజొచ్చిన, వడువునసులంక । వడిజొచ్చి దానవులవ్రచ్చియ, వారథ్యతఖగేంద్రుఁడమృతముఁగొను।కడఁక రాముఁడు నన్నుఁగొనిచనఁ, గాఁ బ్రయత్నము సుయత్నముగఁ జేయు. రామ. 2

నాచేనీయునికివి, న్నపుడెసానుజుఁడై, రామాలివచ్చి రావణుఁద్రుంచిఘనుఁడై । యేచియయోధ్యకు, నిదెనిన్నుఁ గొనిచను, నింద్రాదిసురనుతుఁడై, అనవాచాలకతనిట్లుచాలెద వబ్ధి,కీచయవారెట్లుదాఁటుదురనిన । ఓచంద్రముఖి రాఘవులనా, మూఁపునవహించి దెత్తునిటకు । నాచేతికానవాలిమ్మని, నను నమ్మినెమ్మి చూడామణియొసఁగె. రామ. 3

శ్రీరాముఁడొకనాఁడు, చిత్రకూటగిరిఁ గోరినాతోడలవై
గూర్చియున్నతఱి । మీఁజెరియొక కాకియాఁ, మిసమసినా కాలి
బొటన, వ్రేలుజించెనుడగ్గరినిద్ర । దీరిమారీచ, వైరికాకిపై,
వూరిమంత్రించి, కేరియేయశరమై । గారింపముజ్జగముదిరిగి,
కావుమనిరామునివేడఁగ । న్నీరునీరసముగాఁదనక, న్నిచ్చిచనె
నదిరొయొకటి సేయుము పతికి. రామ. 4

చిఱుతవీరక్కసుల చిక్కులఁబడక జరుగనెట్లగునినిన,
జననినానడక । యొఱఁగవుమిన్నంది, పెరిగెదభయముపడక,
వీక్షింపుమనికడఁక, తెలియ । హరిపీరుఁడుదాల్చె, నరివీర
భయంకరవిగ్రహము శ్రీహరివిష్ణుఁడు త్రివిక్రమ, శ । రీరమును
ధరించు తెఱంగునధరణీధరాభమగునీతను । వరయనాతరమె
శేషాద్రీశ్వరునిరఘువరుని జేరఁగఁజనుమింకను. రామ. 5

7. సారంగరాగము – ఆదితాళము.

పల్లవి.—రఘుప్రవరుచరితము, రాజముఖిసఖివినవే.

అను.—అఘప్రహారియాహనుమంతుఁ, డవనిజాతకునమస్క
రించివన । విఘట్టనమునకుఁగాని కాదుసుర, విపతునిసమక్ష
మనుచుఁ దలఁచె రఘు.

ఫలములుడుల్చివిరుల్ రాల్చితరు, పంక్తులుబడఁగూల్చి
యళి।కులముజోపి పెరలురేపివాపీ, కూపజలములయడుసుపై
కిఁదేల్చి । అలచిత్తరువు మేడమరుత్తనయుఁ, డాగ్రహామునఁ
దన్ని నేలఁగలిపిన । కెలమివారురావణునికెఱిఁగింపఁ, గెరలి
లక్షరాక్షసభటులఁ బనిచె. రఘు. 1

దండిమగలుగండుమిగిలిరాఁగని,గుండెలగలనార్చిగదా ।
దండముగొని ఖండించెనగచరా, ఖండలుఁ డదివిని యమశారి

వేర్చి । మండిపడిపంచసేనాధిపతులఁ, జండకోపకాండచాప
ధరులై । దండనాథులేవురురాఁగపిజము, దండకనిచెవారి
రావణుండులికె. రఘు. 2

దశముఖుఁడు సప్తమంత్రికుమారులఁ, దగువీరులఁబం
పవా । రసమశూలభిండివాలకరవా, లాదిసాధనములననిలజు
నొంప । నసమానబలాఢ్యుఁడై యెదుర్వరను, గనిమసంగితోర
ణస్తంభమున । వెసనుండెహతశేషులవలనవిని యసురేంద్రుఁ
డక్షకుమారుననిచె. రఘు. 3

కరులుహరులునరదములుభటులసం, ఖ్యాతము లేతేర,
బం । ధురకృపాణతనుత్రాణసబాణతూణధనుర్ధరుఁడై యేపు
మీఱి । నరిదివీరుఁడననేఁగియక్షుఁడు, శరములనొంపమారుతి
యలిగిము । ద్గరముచేవ్రేసియతనిఁజంపినై, న్యమును ద్రుంచె
రావణుఁడదియువినె. రఘు. 4

కనులనశ్రుకణములు నెలుఁగున గద్గదికయడరఁగాసు
రా । వణుఁ డింద్రజిత్తు గని గజిబిజిగా, వానరుఁ డొకఁ డిం
తఁజేసితేను । కని సహించుటెట్లు వానిఁ జంపెద, ననినదేవనీవు
పోవనేటికి, వనచరుని, బట్టి దెత్తు నిచటికని, చనిరయి మేఘ
నాథుఁడు సేనతో. రఘు. 5

వాలుబెలుకుగదవిల్ తూపులవ, జ్రాల జోడుదాల్చిర ।
త్నాలసారుదేరుతేరుధీరో, న్నతినెక్కిచనిసామీరినదల్చి వా
లమ్ములై దెనిమిదాలునొకటి, ఫాలహృదయపదవాలముననసు
ర । గిలింపఁగనలిగరుడుఁడననెగసి, కీశవిభుఁడుగూల్చెరథరథ్య
ముల. రఘు. 6

ఎంతవాఁడువీఁ, డని వేటొకతే, కెక్క బ్రహ్మాస్త్రము

దనుజ । కాంతుఁడేసియంత డాసియతిధీ, మంతుహానుమంతుబం
ధించెక్షణము । సంతతమెవనిఁ జేరొ్కనినజనుల,జ్ఞానకర్మ బంధ
ములూడిముక్తి । గాంతురట్టి శేషగిరీశుఁడగురా । ఘువదాసుని
కితరబంధములెంత. రఘు. 7

8. గుమ్మకాంభోజిరాగము - ఆటతాళము.

పల్లవి.—నారీమణివినవేయీాకథాసరణి. నారీ.

అను.—ఆరాక్షసేశ్వరుపట్టిపట్టి । తేరఁగట్టుఁబడవచ్చువానియ।
ధీరాత్మునివలెఁబురముగనువాని వీరహానుమంతుగ్రుద్ధుచుఁ।
దౌరులుచేరిరా, బ్రహ్మాస్త్రమొకలక్షణముతనువంటిచనుట ।
వీరుఁడెఱిఁగియుగౌర్యగౌరవముచే । నూరకజనియెఁజేరోల
గమున, నున్నదనుజవిభునెదుట రావణియిడె నతవి. నారీ.

వూని బ్రహ్మాస్త్రమునఁ గట్టుబడెవీఁడు, మానులువిఱి
చె । వీనిచేదనుజుల్ కొరాకులుగాలి, చేనొరలుగతిఁబడిరనేకు
లుశాస్త్రి । వీనికెయ్యదియోావివేకులు జెప్పిన, దానిఁజేయుంపుము
ల్లోకులుమెచ్చ । గానీవనిన, సుతుమాటలంకా, జాని, వినిప్ర
హాస్తుఁడనుమంత్రుల।తేనిజూచిపలికెవీఁడెవ్వఁడో, తానిచ్చటికి
వచ్చుటేమో క్రీడా । కాననముఁబెఱుకుటేమోసుభటులఁజం
పుటేమోాయీావానరుని, యడుగుమననతఁడటులనేయడిగినవన
చర। నేనువిడిపింతునిన్ను భయముమాని, నిజమాడుసభలోననె.

రావణాలోకత్రయవి, ద్రావణవిన, ఠోరి, సకల । జీవ
హృదయస్థుఁడై మీాఱిచేవ, దేవుఁడౌ శ్రీరామశౌరిపాద । సే
వకుఁడనురాసురారిమారా, మానవేంద్రునినారీమణిని । నీవుకు
నకము, హావిస్సుగొనుగతిఁదెచ్చి, నావు ఇట్లా, యేలరాచెడిపొ,
యేవ్వుఇంకనాబుద్ధివింటే బ్రతి, కేవు,రఘుపతి, ఋష్యమూకము

నను। గ్రీవుఁడనుకపిరాజుతోఁజెలిమిచేసి యొకతూఁపున । నేవా
లిఁజంపి కపులకుఁబతిని జేసిరవిజునికపి దేవుఁడవనిజనుజాడనం
పఁ, గావచ్చితినిఁ బవనజుఁడననె. నారీ. 2

కంటి, రాతమ్మికంటి, సీతను నేనీతోఁటఁ, గూల్చితికొం
టెచేష్టలకోఁతినౌట్ల చంపెద। మంటవచ్చిచస్తే నే,పూటాఅన్నిటి
కంటెమైప్రియమనుమాటవినవే । వింటి, నీకొడుకు నన్ను
సాధించె, నంటపొంగినావుబ్రహ్మాస్త్రము । యొంటనంటి చనె
నీకుప్రియముజెప్పె, నంటబంధునివలెదయచేవచ్చితి । కంట
కపుమతిత్యజింపుముజ, గముగతివిచారింపుము । బంటకొను
మెఱుకనదిముక్తిదను, పౌలస్త్యకుల నీ। వంటివాని కసురత్వ
ము తను, వాత్మగానెన్నుటననెనతఁడు. నారీ. 3

మేనుకంటెను నేనన్యుఁడనియెంచి, తేనిపరాపరమైనవస్తు
వౌదువు । గానీకరయఁబ్రాణబుద్ధీంద్రియదుగఖ, శ్రేణి లేదజ్ఞా
నమెమూలమని। దీనిదెలిసి తేనీకు మేలుకడ, లేనిదీవిగతిగాను
తనువు । లోనీవున్నావంట, యేనుతనసంసృతిబంధమగునది।
మానుచిన్మాత్రుఁడనజుఁడనక్షరుఁడ నేనుఆనందస్వభావుఁడనన
రా । మేనుప్రాణముమనసుమతిమొద, లౌనివిభూమిమరుద ।
హామిక ప్రకృతివికారజాతము, లౌనం దెనయొదునిరభి । మానిని
రుపాధికుఁడీశ్వరుఁడు, తాననియెఱుంగఘనుఁడగునని. నారీ. 4

దశముఖసావధానమతి వైరియొకటి, వినరాముక్తి। వెస
నబ్బుహరిభక్తి, గనరా,దాన,నిశితజ్ఞానముగల్గియున రా,జ్ఞానా ।
భ్యాసనముననుపోహమనరా, దాననసమానభవము చేకొనరా ।
యోరీ। దశరథాత్మజుఁడు ప్రకృతికంటెనుపరుఁడుబిపరుహాతుఁడు
విష్ణుఁడుశ్రీదేవి। వసుధాపుత్రియాచెలిమున్నిడుకొని, రత్న

సమూహాముతోవచ్చియిచ్చిశరణను । వెసనీవెయపరాధినసుమ
తఁ, డు శరణాగతప్రియుఁ । డోసఁగభయము శేషగిరివిభుఁడు
అనిపవనసుతుఁడమ్మ । తసమానముగఁబల్కుపల్కుల, కసురేం
ద్రుఁడలిగినలిరేగెను. నా రీ. 5

9. కర్ణాటకసారంగరాగము - ఆదితాళము.

పల్లవి.—తరుణీయీచరిత్రము, సరణిసుజనాదరణీయము.

అను.—ఇరువదికన్నులను రోషానల మిరవై ప్రజ్వరిలను రావ
ణుఁడు । హరిదాసునిహనుమంతుఁగని వనచరాధమానిను
ద్రుంతుసీతనువధింతు । తరిమి రామలక్ష్మణుల నరిమురిఁజంపి
కపికులాగ్రణుల । తరణిసుతాంగదాదులఁబోరిగొందు,ధరణి
యందుయశము గందునని యెను. తరుణీ.

నూరుకోట్లరావణకీటములునా, తోసమానమాసురారి
నేను । శ్రీరామదూతనై మీఱినానునా, పేరు హనుమంతుఁ
డొకసారిగుద్దితేను,ఓరినీపనిదీఱునీవునీ, వారునాకెంతమాత్ర
మురా దోసకారియని । మారుతిపోనాడవినికిన్కచే నారాక్షస
చూడామణియాతిక్క । దారిఁతికండలుతెగవ్రేసిభూ, తము
లకు బలిసేయుఁడని సెలవీయఁ।జేరిజంపగడఁగెడుభటులని, వా
రించి తనయన్నునుగని । సారభాషణుఁడైనవిభీషణుఁడు, చారు
లెందు నవధ్యులందుర నెను. తరుణీ. 1

వానరుఁజంపుట, పాపమదిగాక, వార్తలెవరు దెలుపు,
వారు వీని । చేనింతయువినిరాఁగోరు, శ్రీరామ, భూనా
థునితోఁ బోరు, వేవేగ, మేనీకుఁజేకూరునో, దానవేంద్రవీనికిఁ
దగినశాస్తి మీరు, సేయఁగానియమింపుఁడనఁదమ్మునినుడి, తా
నెదనిడి రావణాసురుఁడుకపులప్రాణపదముతోఁకయదికాల్చివీని

షోనిండనిపల్క, దనుజభటులల్క । మానకననిలజుఁగట్టి,బహు
వస్త్రచయము తోఁకకుఁజుట్టి । నూనెలోనద్దివహ్నిదరికొల్పి,
యానగరమందుఁ ద్రిప్పి రేమందు. తరుణీ. 2

పావనిచిఱుతమే, నొందెనంతనెవదలె, బంధముల్ ఘన
తనుఁడై తనవెంటవచ్చు । కాపరులఁద్రుంచియింటింటనిజవాల,
దావాగ్నిఁబెట్టిబూడిద పెంటఁజేసెపుర । మావిభీషణునిలువినా,
మంటతోఁగంటక।పావనుఁడుచల్లనాయగరు, వలిచెలిసీతాస్తుతి
గంటగపిపతి । యావనధిలోలాంగూలముముంచిచల్లార్చె, నేవిభు
నామముమూలము దెలిసినజనులు । పావనులైతాపత్రయానల
ముఁ, బాయుదురారఘువరుభటుఁడీవై శ్వానరుని। చేవేగమెతత్క్ష
ణముజని, సీతాసతికిప్రదక్షిణము । గావించిమ్రొక్కి-రామసన్ని
ధికి, దేవినెలవిమ్మనినఁబలికెఁ గొమ్మ. తరుణీ. 3

నిన్నుచూచియూఁఱడియుంటిని, నేనెట్లునిచటనిర్వహిం
తుననిన।కన్నతల్లిమూఁపునధరియింతు రామునితో, నిన్నుగూర్చి
వినుతిగాంతుననినమ।రున్నందనునిభక్తిమంతుఁగని విను,మన్న
నేవేవగనైనాప్రాణముల్ ధరింతునీవావా । రాన్నిధియింకించి
యైనబంధించియైన, రాముఁడువచ్చి యనిలోనదశకంఠుఁజంపి
నన్నుఁ జేకొనినఁగీర్తియందాక, మిన్నకుండుఁ బొమ్మా హరిఁ
దోడితెమ్మా । యన్న నాంజనేయుఁడు చనిసువేలాచలమెక్కి
యార్చెనువిని । యెన్నిరంగదజాంబవత్ప్రముఖులు ఇదివాయు
సుతునివిజయ నాదమని. తరుణీ. 4

తరుచరపతిచరణములూనినతరి, గిరధరిత్రికిసరిగాఁగ్రుం
గి, యెగురు । తరిముప్పదియోజనముల్ నింగి, కెగరుసాగరము
దాఁటిఖగరాజుభంగి, మహేంద్ర । ధరణీధరమెక్కెనుబొంగి.

సామీరినినరసికౌఁగలించిరియంగదాదులు । చెలంగిపోయినపని। నెఱవేఱెనాయనినమీకృపచేఁగంటి, ధరణిజనని నడచిన తెఱఁగంతఁ దెల్ప । హరివీరులనిలజునిఁగొనియాడిరి, యానందమున నాడిరి, తోఁకముద్ధాడిరి।పఱచిమధువనమునకుఁజనిమధు, ఫలములడుగ శేషాద్రిధని।కరుణగలుగఫలంబుల కేమీయని, మరుత్సుతుఁడిచ్చె, సెల వెలమి హెచ్చి. తరుణీ. 5

## 10. నవరోజురాగము - ఆదితాళము.

పల్లవి—పరిగారీసచ్చరిత్రము వినువారి, కరయనెవ్వారిలను, గౌరీ.

అను.—తరుచరులమ్మధువనపాలకులనె, న్నక తేనెలాని, ఫలములుగొని కాపరులఁ । జరణతలతాడితులఁజేసిన, వెఱచఱచి దధిముఖాదులుజని తరణిసుతునకెఱఁగివనభంగ, సరణి దెలిపిన నతఁడెదఁబొదలె. సరిగా.

చూచివచ్చెహను, మంతుఁడుసీతా, సుందరీమణి, నీవా మధువన । మాచెల్వమునఁజొచ్చిరసురవిజునిమాటహరివీనులల రవిని । నాచెవికవనిజఁజేరో, నినట్లున్న, దనిననానోమహాత్మా। రాచకార్యమునెఱపిహనుమ, త్ప్రముఖులిదెవచ్చిరని పిలువవ । నేచరులనంపఁజనిమిముఁగపి, నేతముదమునరమ్మనెననిరి. సరిగా.

మిన్నుముట్టియాడుచువానరులుమ, రున్నందనాంగదుల ప్రాపునరామ । సన్నిధిఁజెన్నిధి, గన్నట్లుగని మ్రొక్కి, రున్నతి మదిఁబొదల । చెన్నలరఁగంటిసీ, తనులోకమాతమీ, సేమ మరసె రామ।చంద్ర రాజేంద్ర।విన్నపమశోకవనిజానకి, యున్నది కృశించిజడగట్టిన । పెన్నెఱులతో రామరామా, యన్నసుడి తోడననెమారుతి. సరిగా. 2

నేనుశింశుపా, తరుశాఖలనుండి, నీకథవివరించినవిని భూపుత్రి । వీనులకమృతసమానముగాఁబల్కు, వీఁడెవ్వఁడని యెంచిన । మానవతీమణియెదుటవానరశిశువు, నై నిలిచిమ్రొక్కి నమ్మికబుట్టునట్టుగా।పూని యాద్యంతములు తేటముగా నెఱుఁగఁ జెప్పిముద్రికవిభుఁ । డానవాలంపిరనియొసఁగిన, నందిమిన్నందె ననేఁబావని. సరిగా. 3

ననునమ్మిమాయమ్మపల్కరా,మునికెట్లు నామీఁదదయా రసము । జనియించునట్లువిన్న,వించునాయిడుములు, గనినవాఁ డవుగావా । అనినరాఘవుఁడు ని,న్నెడబాసినదిమొదలు, హా సీతాయనిశోకించుచున్నాఁడు నేఁ । జనినీయునికిదెల్పనృపుఁడను, జార్కసుతయుతుఁడై కపులఁదో । డ్కొనివచ్చియరివ్రచ్చినిను జేకొనునంటినంజనీసుతుఁడు. సరిగా. 4

అనతీవమ్మ రామునియొద్దికననభి,జ్ఞానార్థముగఁ జూడా రత్నమొసఁగి । ఆనాఁడుకాకముమదమడఁచుటఁదెల్పు, మనె సామినీతోడ । నేనునామఱఁదిలక్ష్మణునిదుర్భాషల, జ్ఞానమున నంటినదిశమింపు మని । అనెలఁతకన్నీరుమున్నీ । రననించమార డించిఘనో । ద్యాన మగలించి యక్షముఖదనుజాల వధించితి ననె నతఁడు. సరిగా. 5

కొంకక రావణుఁగాంచిభాషించి, లంకాపురిగాల్చిసీతా జ్ఞచేఁ । బొంకముగావచ్చితిరామనీపాదాం, బుజములొదలఁ దాల్చి । కింకరుఁడదయజూడుమనివాయుజుఁడుబ, ల్కనరాఘు వేంద్రుఁడానందసాంద్రుఁడై । పంకజభవాదులకశక్యము, పవన సుతనీకేతగునీపని । కింకొకటిసాటిగాదనిగడి, యించెఁగొఁగిట రాముఁడనిలజు. సరిగా. 6

పరమాత్ముఁడనౌనా, పరిరంభణముదుర్లభమువినుసామీరి, యనెనెవ్వని । చరణాబ్జయుగళతులసీదళమ్ములఁబూజసలిపిన శ్రీమీఁజే ! పరమపదమందు, దురారాముని చేనాలింగితుఁడయ్యె హనుమంతుఁడేమందు । గరిమనధ్యాత్మ రామాయణ, కావ్యమున సుందరకాండమిది । యరసి తేనిఁగించె సుబ్రహ్మణ్య కవిశేషగిరిశు పేరిట. సరిగా. 7

సుందరకాండము సంపూర్ణము.

శ్రీ ర స్తు.

# శ్రీమదధ్యాత్మరామాయణకీర్తనలు.

## యుద్ధకాండము.

---

1. భైరవిరాగము - ఆదితాళము.

పల్లవి.—శ్రీరాజరాజేశ్వరి యీచ, రిత్రమార్యనుతిపాత్రము.
అను.— చేరిదాశరథి, మోదముమది, మీఱదయాశరథి, గ్రై
పలికె। మారుతిచేసినపని దేవతలచే,నీరదోరులతరమెసాగరమె।
వ్వారుదాఁటువారు లంక యె,వ్వరికిఁగాల్చిరాదీఋసా। మీరి
వలననేను రఘుకులము సౌ,మిత్రియు రవిసుతుఁడును బ్రతుక
గలిగెననె. శ్రీరా.

ఈ సుగ్రీవునిభాగ్యమహిమనుతి, యింపఁ దరముగాదు,
కడలిన క్రాహి। వైసారిణములకుపాదు, ఇదిదాఁట, నేసరిణినా
నిఁకమీఁదు, రావ। ణాసురుఁగెల్చియెట్లాసీతఁజేకొన, నగునిదే
టివాదు। మోసమాయబలాయనినరా,మునిఁ గని ప్లవగకులా
గ్రణిపలికె। నీసముద్రమెంత రావణుఁడెంత, యేమిటికీచింత
గెలుపువింత। నీసరిలేరనివిల్లుఁగొని, నిల్వనిన్నెదురనెవరివశము।
వేసంద్రముదాఁటనూహింపురఘు, వీరరావణునిమృతునిగదలం
పుమనె. శ్రీరా. 1

వానరవీరులు కామరూపులని, వార్యబలులు చూడు,
నీపనికై యగ్ని।లోనైనఁజొరనున్నారునేడనిభక్తి మానుషము
లేర్పడనాడు భాను, సూనువాక్యముల, కలరియంజని, సుతు

గనిపుడమితేఁడు । నేనీచేలంకారూపమువిని, దానిపొంకమింకఁ
జేతుననఁ భూనుత దివ్యతేజోధికమై లంకాపురి త్రికూటగిరిపై
నున్నదియొరపై । దానిచుట్టువారాన్నిధియగ,డ్త యగుకోట
మణిహైరణ్మయము । పూనిధర్మార్థకామమోక్షముల, నానలరు
చతుర్ద్వారముల ననె నతఁడు. శ్రీరా. 2

తరణిశశాంకుల, పైవిరోధమున, దమవారలకన్న, ము
న్నొఆసెనన్న । కరణి గోపురములుమిన్నొ, వరించెను, పరిగెలు
గృహములనన్న మేల్చి । త్తరువుకూటముల, మణికవాటము
లఁ, దనరుసుప్రసన్న । సరసోద్యానములనడబావుల. చలువచ
ప్పరములవరవిపణి । సరణుల దేవాలయములముత్యపు, సరులఁ
దోరణాలఁదనరె శ్రీల । కిరవప్పురినిక్కచూడ లేఁ,డింద్రుఁడైననలు
చక్కకరుల । హరులరథసహస్రములనెక్కి సక, లాస్త్రకుశలుల
సురు లరయుదురనెనతఁడు. శ్రీరా. 3

రాజసింహామిట్లున్న రావణుబల, రాజినాల్గవపాలుహత
ముర్యొనాచే । జేజేరామపదివేలుప్రణతుల్, నేఁజేసెదనన్నేలు
బంటనోజయశ్రీరమణయనినహరిహాను, మంతునిమేలుపూజ
హాన్సమములఁజేసితపన, పుత్రుఁగనిసైన్యములనడిపింపుమి ।
దేజయముహూర్తమని రాముఁడాన, తీయఁ బ్రయాణభేరిప్రే
యించె శౌరి । ఆజితనయుఁ డనిలాత్మజు నెక్క, నంగదుఁడు
వహించె లక్ష్మణుని । ఆన కగచరేంద్రపాలితకపిబ, లాళి యిల
యీనుగతినడచె దక్షిణము. శ్రీరా. 4

తరుచరులెగురుచు బరువులిడుచురుచి, కరములయినపం
ర్లుదినితేనెలాని । గిరులెత్తుచుఁబుట్టచెండ్లునానె, గరవైచుచుగొ
ప్పగుండ్లుదాఁటుచు । హరిమేమేదశాస్యుఁ ద్రుంతుమేఁగెననిర

త,నూ తేండ్లు।మఱి రేఁబగలనకవింధ్య, సహ్యమలయాద్రులుఘ
నకాననములును । ఉరువడిదాఁటికర్కాటకకమఠ మ్మ,కరఝ
షోగ్రాభంగరంగత్తరంగా । కరమైభీకరమైనరత్నా, కరముఁజేరి
యాదారమైత్రిఁగని । మురువుగ నిటసేనవిడియ నియమిం,పు
మనినస్వామి మహాప్రసాదమనెను. శ్రీరా. 5

ఆవేళ సీతనుదలఁచిరాముఁడా,హాయనివిరహార్తినొందె నే
మందు । నావిభుఁడు సత్యజ్ఞానస్ఫూర్తిప్రజ్ఞానఘన కేవలానం
దమూర్తి, యోగ । కోవిదభావానువర్తిసుకీర్తి, దేవతాచక్ర
వర్తి । శ్రీవిభునెఱిఁగినదుఃఖాదులు, చెందనేరవాగినా, ఘను
నెనయునే।జీవాభిమానికేదుఃఖజాలము, చిద్రూపమాపరమా
త్మకులేదుమా । భావమునకెళోకాదులునిదుర, వాఁవఁగలవెయె
ఱుకేకా, నిలిచెఁ । గావునశేషాద్రిపతి రాముఁడు సకలసాక్షి
యనితలఁపనయ్యె బుధులచే. శ్రీరా. 6

2. శంకరాభరణము - ఆదితాళము.

పల్లవి.—వినవెమదవతీసతీ, వినయదయాదాక్షిణ్యలసన్మతీ.

అను.—హనుమంతుచేనైనసా, హసము, గని సిగ్గునఁ దలవంచి
రావణుఁడు।చనదుసురలనేనైననిటు సేయు, నని, మంత్రులఁ
బిలువనంపిపలికె. వినవె.

హితులారా కదనవిజితవిమతులారా ప్రభంజన । సుతుఁ
డు చేసినపనిగంటిరె, శూరతమీఱఁ । గొతుకకలంకఁబ్ర వేశించి
భూసుతఁగాంచి యతొదులఁ బొలియించి । వితతమగులంకఁ
గాల్చిగెల్చినే, వెరవేమిచెప్పుఁడనెదనుజపతి. వినవె. 1

* ఓదేవా, గానముదితమ, హాదేవా, వలదుసీ । తాదయి
తువలనిభయముజగ,త్రయజయప్రభావా । ఆదేవేంద్రుఁజెఱ

నిడె నీకొడుకలకాపతియళికిపుష్పకమొసఁగె । నాదరింపువరు
ణుని యమునికి భయము నొందనిదెంతనిరిహితులు, వినవె. 2

మయుఁడుబాలామణినీకొసఁగి, నయముచాలాగాంచె
నీ । దయనుహనుమంతుఁ డిటుచేసెనని, దనుజలోకపాలా । మ
యమునఁబడనేలకోఁతియనిరే, మఱియుంటిమతఁడందునబ్రది
కిచనె।నియమింపు మొనర్తు మిల నమర్త్యగ, నిర్వాణర గానని
రసురులు వినవె. 3

నిదురదేరికుంభకర్ణుఁడు, చదురుఁ జేరియీమాటల ।
యుదుటగాంచిరావణునిఁ దిలకించిరోదోసకారి । పదరియేపనిఁ
జేసితివిదీన, ఫలమేమినీకిదె చేటుకాలము । చిదచిదాత్మకుఁడు
రాముఁడు శ్రీహరి, సీతాసతి శ్రీదేవియనెను. వినవె. 4

రామసౌమిత్రులఁగపులసం, గ్రామభూమిఁబోరిగొందు ।
సామినేఁగల్గినీమదికివి, చారమేమిా । శేముషీజితాబ్జజయని
యింద్రజిత్తు వల్కనత్తఱిని భాగవత । గ్రామణివిభీషణుఁడు
శేషాచలకాంతాంఘ్రులెదనిడిసభకుఁజనె. వినవె. 5

3. కల్యాణిరాగము - ఝంపాతాళము.

పల్లవి.—కాళీ వినుసుజ్ఞాన, జనమానసకాసారకేళీవిహార
మరాళి.

అను.—మేలుగోరిసురారికోమలాంఘ్రులకుఁ, గేలుగదియించి,
విభీషణుఁడన్నమన్నన । చాలఁజెందిసభికులఁదిలకించిదనుజే,
శ్వరుఁడుకామాతురుని గాంచి పలికె శ్రీ. కాళీ.

రావణాయీకుంభకర్ణుఁడునీయింద్రజిత్తు మహోదరమ
హాపార్శ్వులు । దేవాయీకుంభనికుంభాతికాయులీ, దేవాంతక
నరాంతకులు మొదలౌవీరులు, నిను । గావలేరారఘుకులేశ్వరుని

ఖారి, నీవుపడు వేళనిను సీతయనుబల్గాము। గావుగొన్నదివెర
వెన్న మఱిలేదుసీత, నీవలెఁ జోరగావలెఁ హరిశరణనె. కాళీ.

ఇనకులాగ్రణి బాణముల్ లంకాపురి, ఘనంబుగనిండి రాక్షసులప్రాణముల్। గొనకమున్నె జానకిరాఘువునకొసఁగఁ దగు, కులగోత్రాకారులు నఖదంష్ట్రాయుధుల్। వనచరులునిరుపమబలుఁల్ లంకఁజొచ్చి, వారకగలంచకమును రామునకుసతిని। మ్మనఘనీవుబ్రదుక, లేవుహరిసురేంద్రాదు, లాదరించిననిను హరించురాముఁడనె. కాళీ. 2

రాముఁడె నీపాలిమృత్యువుపాతా, ళలోకమునకేఁగినఁ బోనిచ్చునా, యేమందునిన్ననినతమ్మునిహితోక్తుల, హితమారయొనన్న కౌషధమురోగి మెచ్చునా। యామినీచరగ్రామణివిధివశుఁడై, యామెయివిభీషణునిగని యోరినేవొసఁగు। కామితార్థములసమర్థత నొందిపొగరునఁ, గాఱులాడుచు వైరులఁబొగడెదవనె. కాళీ. 3

కలిగినాఁడు విభీషణుఁడనుశత్రుఁడు, ఖలుఁడుకృతఘ్నుఁ డతనితోఁజెలిమి, దలఁపఁగూడునాదాయాది, చెడగోరునను, పలుకునిజమాయె నొరుఁడిటుపలికినబలిమి। దలతెగవ్రేతును బగదీరనసుర,కులాధమానినుగాల్పనేయని దశముఖుఁడు। పలుకవినిరోషమున విభీషణుఁడునల్వురమంత్రులును దానెగసె నుగదాయుతభుజుఁడై. కాళీ. 4

గగనమార్గమునందునిల్చివిభీషణుఁడు, గంభీరరవంబునఁ బల్కెనురావణా! అగడుఁజెంది చెడిపోకుప్రియవాదినై హిత, వాచరించుననుదిరస్కరించితివట్టైనా, తగినమన్ననఁజేసితిని మఱిపితృసముఁడవు,దశరథతనూజుఁడై యవతరించెఁగాలుఁడు। జగతి

రామరూపమైమహీ, జాతసీతయనఁగ జనించెనుజనకునింటననె
నతఁడు. కాళీ. 5

ధరణీభారముఁమాన్ప సీతారాములు, దలంచిరి విధి ప్రేరితుఁడవై నేఁ । గఱపినహితవాక్యములు వినవైతివి ప్రకృతి, కరయసాక్షీభూతములవెలిలోను తానె । బెరయనానారూపనామ భేదముల,భిన్నునివలెఁదరువులందనలుఁ డొకఁడైన। కరణిరాగవస్తుయోగమునరక్తస్ఫటికమనినట్లాహారిగుణాకరుఁడగునవె. కా.

కాలమవ్యక్తముప్రధానపురుషులనఁ, గనాల్గుప్రధానపురుషులచేజగములీలఁ దనరుభగవంతుఁడురాముఁడై సంహ, రించునిన్ను నీవారితో నిదినిజమ్ము, జాలినేఁజనిహారికినేమమున మ్రొక్కి, శ్రీలలరసుందునని విభీషణుఁడువారల, జోలిమాలి, భ్రమలఁదోలి శేషాద్రిపతియ,శోవిశాలుని సేవఁజేయునపుడె చనె. కా.

4. సావేరిరాగము - అటతాళము.

పల్లవి.—కామలీలాకార్ము, కవిజయభూౖలతా । ఖిలపావనను
వ్రతా, హిమశైలసుతావినవే.

అను.—ధీమంతుఁడగు విభీషణుఁడు నల్వురుమంత్రులతో వచ్చిదివినినిల్చిరాముని। శ్రీమహితనాముని పాదనీరేజాతములఁజూచినతుఁడై । రామారాజీవలోచన నాసామిరావినుమ నిపలికె ఘనముగను జెవులపండుగను. కామలీలా.

నేవిభీషణుఁడ నీసతినిమ్రుచ్చిలినట్టి, రావణుని తమ్ముఁడను రామాఅన్న । చేవిడువఁబడితిగుణ, ధామాయింక నీవేగతి ఘనశ్యామాసీతా । దేవిరామునికిమ్మని దశముఖునితోఁ, దెలిపినఁజంపవచ్చెనురణభీమాఆ । దేవారికివెఱచి నేవచ్చితినేనీ, సేవార్థము దేవదేవదీనులకునీవేదిక్కనినను డివిని, సుగ్రీవుఁడితని

నమ్మకుముమా । యావిపగతుని యనుజుఁడుబలియుఁ డనఘసెల
విమ్ము ద్రుంతు సచివులతోననియె రఘుపతితో వినవె. కామలీ. 1

ఇనకులమణిరవిజునిమాటవినినవ్వి, యనెనేఁదలఁచినమా
త్రమునజగముఁలనుజగత్పతులనిమిషమున ద్రుంతు, జననమొం
దింతువేగమునఁదెమ్మా । దనుజునిసకలభూతాభయదానకంక
ణముగట్టితినే లోకమున, ననిన । జననాయకుఁ బొగడి దినవా
థాత్మజుఁడో, యననావిభీషణనాముని దెచ్చికనుంపిఁప । గని
మ్రొక్కి రామునిఘనశ్యామునివిశాలాక్షుని । మనోజముఖా
బ్జునిధనుశ్శర,మహితకరుని ప్రశాంతుని లక్ష్మణాన్వితుఁబొగడఁ
దొడంగెవిను. కామలీ. 2

శ్రీరామరాజలలామమ్రొక్కెదనీకు, సీతాహృదయా
భిరామా । ధనుర్ధారిపూరితభక్తకామా శాంతా, కారాయ
నంతశ్రీధామా నమ । స్కారము సుగ్రీవమిత్ర జేజేనీకం, జలిర
ఘువరసార్వభౌమాజగము । గోరి పుట్టింపఁజేరిరక్షింపమారి
శిక్షింపనీరీతులకాది । కారణంబగునీకునతిత్రిజగద్గురుఁడవైతగు
నీకుజో । హారనాదిగృహస్థవగునీ, కమితసాష్టాంగములుచేతు
హరీనుత వాగ్ఝురీయనెనువిను. కామలీ. 3

చరాచరభూతములు వెలితో వ్యాపక, స్వరూపమున
వశించియుండు । తెలుఁగరజ్జులుమాయనుంచియొలుక, మఱచి
జన్మమృతులుగాంచియెపుడు । తిరుగుచుందురు శరణాగతులఁ
బ్రోవవేదేవ, దయారసమునించిసుజనా । దరణీయనుగాదు
ధరణీధరలోకసరణిశుక్తిరజతము కరణిభ్రమయని । యరయక
జ్ఞులుపుత్రదారగృహాదులందాసనేయుచు విష । యరతులగు

దురతుదనవిశోక, కరములగుసుజనుఁడిదిగనువరదాపాలితద్విర
దాయనెను. కామ. 4

నీవేయింద్రుఁడీశానుఁడాద్యంతమైనది, గ్దవతలునీవణువు
కన్ననణువు । నీవుగొప్పవుగొప్పకన్నద్రిభువ । నావళితలితంద్రి
వన్ననీవె । నీవాదిమధ్యాంతరహితుఁడవు పూర్ణుఁడవు నీవవ్య
యుఁడవు సుప్రసన్న శిరో । గ్రీవశ్రోత్రవక్షజ్నేత్ర,శ్రేణి
వజితుఁడవుమాయావాసనాసాక్షివి । నీవుద్రష్టవుశ్రోతవుగుణా,
న్వితపంచకోశాతీతుఁడవు । నీవనాశ్రయుఁడవవికారివి, భావర
హితుఁడ వాదిపురుషుఁడవు ప్రకృతి కవ్వలివాఁడ వనె. కామ.

మాయచేనిజరూపుముఁవిడి నరునివలె మహిఁజూపట్టి
తివగుణియించుననుని । ర్నాయకునిగానునిలుచు, మహితధీ
యుతుఁడు మోక్షముగాంచు, గాన । నీయంఘ్రిభక్తియును
నిచ్చనచేఁగందు, నీచిత్సుఖపుమేడసంచు యోగి । ధ్యేయను
జనవిధేయశుభనామధేయ, ప్రణతగాధేయనను బ్రోవుము। శ్రీ
యుతాంఘ్రిలకునతియనినుతిఁ, జేసినవిభీషణునిగనిరఘు । నాయ
కుఁడుహితముగోరుము, ఇపుడే మొసంగుదు దనుజకులతిల,
కాయనిపలుకనతఁడుప్పొంగె. కామ. 6

నేనుధన్యుఁడఁగృతకృత్యుఁడనైతి నినుగంటినీదయగంటి
బ్ర । హ్మానందము చేకొంటి జగతిలో నెవ్వఁడు నరువంటి
ఘనుఁడు । నేనొల్లసతీసుతసంపదలహరి నీయందేభక్తియుండ
వలెనంటినట్ల । గానిమ్మనన సురజానిక మదిమెచ్చి నేనెమ్మ
దిలోనిన్నెనమ్మితిననిన । వానిమది, సీతాసమేతుఁడనై నిల్తునకు
టిలుఁడవైనను, ధ్యానించుభవజలధిదాఁటుమ, నన్యమిాస్తవ
మునీఁబఠించు, నతఁడుకోర్కులుగాంచునని. కామ. 7

ననుగన్న ఫలమిప్పుడే గాంచువీఁడు లక్ష్మణా లంకయేలిం
తుజూఁడు, జలము । గొని తెమ్మభిషేకింతు నేఁడు శిరుల, దనర
దీవింతునీతోఁడుయెంత । దను కాచంద్రార్కులెందాక యిల
నాకథ యెందాఁకనుండు, నందాఁకవీఁడు రాజ్య । మునుజేయు
నటంచు మనుజేంద్రుఁడుబల్కి, దనుజేశుఁ బట్టభద్రునిఁ
జేసెమంత్రులతో । వనచరులలరిరినజుఁడాలిం । గనముచేసివిభీ
షణా రావణవధకు తోఁడుగమ్మనిప, ల్కినకీర్తిసాంద్రుఁ డగు
శేషగిరీంద్రునిసేవయొనరింతమనె. కామ. 8

5. కాఫిరాగము - ఆదితాళము.

పల్లవి.—అళినీలకుటిలాల కాని । స్తులకస్తూరికాలంకృతఫాల
ఫలకా, సఖీజనతిలకా. వినె.
అను.—అలపుంక్తికంఠుఁడంపశుకుఁడను నసురుఁడటువచ్చివిను
వీథినిల్చి । పలికె సుగ్రీవమహారాజ రావణుఁడునీకా గరపు
మనినమాటలనెను. అళి.

మంచికులమునజనించినావు కపిమండలాధిపతివైనావు ।
యెంచినాననుజ, సమునిగాను నెపుడునధముడఁగుడువకపోవు
మోహించి రాకొమరుసతి దెచ్చితేనీ, కేమిపురికేగుమిఁక
నీవు । మించిసురులులంకఁజొరలేరెంత, మీరనిదశముఖుఁడు
దెల్పెననెశుకుఁ. డళి. 1

వానరులానుడివినిపట్టికట్టి వానిఁగొట్టిన నొచ్చిరామా।
భానువంశాబ్ధిసోమ దూతల, వధ్యులనకజంపెద రఘువీరామ
దయ । చేనివారింపు మనినన భయమిచ్చితి వెఱవవలదనేను రా
మ । క్ష్మానాథుండుకపిసేనశుకుఁడరసి మాదొరతో నేమందుని
నజయనె. నళి. 2

వాలిమాయన్న యెటులట్లనీవు । వధకర్తుఁడవసురాధ
మా । కాలమైవచ్చెనీకుసకులము, గానినుజంపు రాముఁడని తె
ల్పుమా, యనిలీలనాదిత్యసుతుఁడు బలుకవాఁడేగి రావణుని
తోనుపమ । శాలియై యదంతయును దెల్పిన విషాదహృదయుఁ
డై యుండెడనుజపతి. యళి. 3

అటుమీఁదట రాముఁ డబ్ధియుప్పొంగుటఁ గనికను లెఱ్ఱఁ
గఁజేసి । కుటిలభృకుటియైపలికె కనుఁగొనులక్ష్మణ ననుగనక
వారాశిది । క్తటములాక్రమింపఁగడగెనీనిమ । దమడంతుఁగపు
లు శ్రమముఁబాసి । చటులగతినడిచిపోదురుగాకని చాపమెక్కు
డిమహాశుగముదొడిగె. నళి. 4

గడగడవడఁకెను బుడమిదిశలవిసెఁ, గడలిదివ్యతనువు
ధరించి । వడిగావచ్చిసన్మణులను రఘువరుముందరనుంచినమ
స్కరించినే । జడుఁడనుశ్రీరామశుభనామ నాయెడఁదప్పులను
మన్నించి । కడుదయఁగావుకావు భూతపంచకములకు జడిమ
స్వధర్మమనిపలికె. నళి. 5

నీవు నిర్గుణుఁడవవికారివిమా, యావివౌతజవిరాడ్రూ
పు । నీవంగీకరించి జగముల నేర్పునసృజింతువౌరనీవైపులో ।
దేవ నీసత్వమునసురులయిరివి, ధి ప్రముఖులకునీవేప్రాపు । భా
వజారినికినుకచేఁబొడ మెభవ్యగుణసాంద్ర రాఘవేంద్రయనె. న.

పుండరీకాక్ష మాయామనుజతనుండవనినిను దెలియఁ
గలదే । దండమేమూర్ఖులకుసన్మార్గదము పశువులకు మునుకోల
వలెనేనీకనీ । దండచేరితిదండమయాకో, దండధారియభయ
మిమ్మింకనే । నిండుభక్తిలంకకుఁద్రోవయయిత్తునీకనుచు సరిత్ప
తివిన్నవించె. నళి. 7

రిత్తవోదీమహాశరముదీని కీర్తజెగురిఁజూపుమనిహరి। యొత్తి బల్కనన్ను బాధించుచు నున్నారుఖలుద్రుమకుల్యా మనుదరినా। మొత్తముపై వేయుమనిపల్కను సముద్రుఁడు రఘువీరుఁడు నలరి। సత్తుగ శరము నేయ నాభీరుల, రిత్తఁజేసి యపుడెపోదిఁజేరెనది. యళి. 8

చెలఁగి విశ్వకర్మసుతుఁ డానలునిచే సేతువొనరింపు మితఁడు। తొలుత నేవరముగొనెనిందుకని పలికిహరి కెరగిచనె సాగరుఁడుకడు। నలరెలక్ష్మణకపీంద్రులతో శ్రేష్ఠాచలేశుఁడ గురఘువిభుఁడు। నలునిజలధికిసేతువుగట్టుమని సెలవొసంగెనగ చరులు హర్షించి. రళినీల. 9

6. సురటిరాగము - అటతాళము.

పల్లవి.—రామలింగావృషభతు, రంగారాజితాంగా. రామ.

అను.—కామితప్రద సత్కరుణాపాంగా, కామగర్వభంగా గంగోత్తమాంగా. రామ.

అమరాచలచాప అజ్ఞానాంధదీప। శమనాంతకరూప సుగుణకలాప అమితప్రతాప। శమితనమజ్జనజన్మసంచితపాప, విమతాంతకరూప విశ్వనిర్లేప. రామ. 1

బాలేందుకిరీట భవ్యజటాజూట। శ్రీలసల్లలాట శ్రుతి చయఘోట, త్రిపురదావకృపీట। లీలాహాస నిర్మూలితనిశాట, శూలాయుధఖేట సుజనహేమకూట. రామ. 2

సోమార్కానలనేత్ర సుందరీజనచైత్ర। హైమవతీకళత్ర, సన్నుతిపాత్ర కోమలతాలవిత్ర। సామజాసురజైత్ర,సకలలోకసూత్ర, శ్రీమచ్చరిత్ర, శేషాద్రీశమిత్ర. రామ. 3

తాంకిటతకతకిటరిమరిస రీతహాతర్ఝొంరిమపధత కుంద

ఝుంతారి తధపధమప . తాహతకిటతక, ఝుంతారిస్సరిమరీ సనిసరీసనిధప, తాంతకిట పధమనిధ పమధళాంగు ధిమితక దధిగిణతోం. రామ. 4

7. బిలహరిరాగము - ఆదితాళము.

పల్లవి.—వినుసర్వమంగళానయనకళా, విజితాంబుజదళశంఖ సుందరగళా.

అను.—ఇనకులమణి సేతువు మొదటనురా, మేశ్వరునొనరించి పూజించియే । మనుజుఁడు సేతుస్నానము, రామలింగదర్శన సన్మానము । గనునతఁడుపంచమహాపాతకము, లనుజయించు నాదయనటంచుఁ బలికెను. విను.

నరుఁడు కాశికిఁబోయిగంగాజలముగొని । యరుదెంచిరా మేశ్వరునినభిషేకించి । బరువు జలధిలోఁబడవైవబ్రహ్మప్రాపుఁ డౌనని యాకరణి । తరణికులాబ్ధిసోముఁడు శ్రీరాముఁడుపల్కుఁ దరుచరులుత్సహించి చలము రెట్టించి । గురుగులగతిదొంతరగాఁ బలుగిరులుతరగతిఁగొనితరలగా । అరుదుగ నలుఁడందినాఁడు సేతువా, నరిచెనోఁజఁబదునాల్గుయోజనములిఁక. విను. 1

ఇరువైయిరువై యొక్కటియిరువై రెండిరువయిమూఁడు । మరునాడు మూఁడవనాఁడు చతుర్థపంచవా । సరములశతయోజనములుకపులు సేతువు పరువడిగట్టిరిజూడుహరి । వరిపరివృతులయిదా, శరథులుహనుమంతాంగదులనెక్కి మైబొదల । మెఱసి సువేలాద్రికిఁ జనికాం, చిరిపరిఘుధ్వజతోరణమణీ । హీర క్ష్మాయప్రాకారసౌధగృహావరవిటంకదై తనరులంకపొంకము. విను. 2

పదితలలనుమణికిరీటములుంచి చెవుల స్వర్ణకుండలము
లు బెట్టిచేతులఁ । గదియరతనాలకడ్యాలుగీలుకొల్పి కలి
తాంగుళములనుంగరములు । పదిలపఱిచిఱొమ్మున వేల్పుటేనుఁ
గుకొమ్ముపతకమైతనరార ఘుసరుచిదేరఁ । త్రిదశులఁగెలిచిన బీర
ముతనపాదమునఁదగుగండపెండేరము । చదురనుత్తర గోపుర
ముమీఁద దశాననుండు కొలువుండె నిండుమనమున. విను. 3

## పాత్రాంతరము.

చలువగొడుగులనీడ రావణుఁడు వి, శాలసౌధముననుండ
యోధవరులతో. విను.

అపుడుశుకుఁడనుచారుఁడా రావణునిగనివిపులమహాదనుజ
సేనకు కపిసేనకు । నెపుడుసంధిగాదు దేవాసురులవలె నీకనొక
పనితడవుసేయకు । నృపకుంజరునకు వైదేహినిచ్చుటొండె జగడ
మిచ్చుటొండె రాముఁడుసుగుణాభిరాముఁడు । విపులాత్మజనే
బలముగొని వెఱువకదెచ్చితివా, బలము । ఇపుడుజూపునీసతుల
లంకరమియింపుమని నీతోఁదెల్పుమనిపలికెననె. విను. 4

శ్రీరామలక్ష్మణులుసుగ్రీవవిభీషణులు చెలఁగినల్వురొ
క్కచో నున్నారుచూడు । వీరెలంకనశింపఁజేయఁజాలుదురితర
వీరులనేకులున్నారెన్నుచో । సారమహాప్లవగసేనసంఖ్యసేయనా
తరమా, మేరుమందరతుల్యులు, యోధాగ్రేసరులు । చేరివిను
లంకకెదురై పలుమాఱదల్చుచు ధృతికిఁ గుదురై । మీఱి
యూధపులు నూఱువేల్గొలువ, మెలఁగునతఁడుదివాకరసుతుఁ
డనిపలికె. విను. 5

ఇతఁడగ్నినందనుఁడు సేనాపతినీలుఁడు, ఇతఁడు వాలికొడు
కంగదుఁడుయువరా । జితఁడతుహాంతయా హనుమంతుఁడీ

ఘునుఁడెసీతనీక్షించిచనెరామునికడకు। ఇతఁడు శ్వేతుఁడురంభుఁ డితఁడుశరభుఁడుపనసుఁడు।ఇతఁడుమైందుఁడుద్వివిదుఁడు యోధాగ్రేసరుఁడు । ఇతఁడ విశ్వకర్మసుతుఁడునలుండీ, బలములెన్న లేఁడీశుఁడు । అతులశౌర్య లతిబలాఢ్యులందఱు, చతురులసురవధకు దనుజవర యనియెను. విను. 6

ఇరువదియొక్క వేలకోటు, లిరువదియొక వేలశంఖము । లిరువదియొకవేలబృందములు సుగ్రీవునిమంత్రి । వరసేనలసుగ్ధల బలములెక్కపెట్టనా, వశముగాదు, రేయుఁబగలుఁ । బరమాత్ముఁడాదినారాయణుఁడురాముఁడు, పరాపరశక్తిభూపుత్రిలోకజనయిత్రి । మఱివారివలనజగముసం, భవమాయెవారితోవైరము కొఱగాదఖిలమాతసీతనీవు । గోరితెచ్చుకొనుటకార్చిచ్చు తెఱుఁగనె. విను. 7

జలబుద్బుదమువలెఁజంచలముసంసారము, క్షణభంగురముకాయము, పంచభూతముల । వలనైపంచవింశతితత్వాత్మకమైజడమై, పొలుపొందుబట్టి తెలియమాయము । ఇలనెవఁడు దీనియందుమమతనేయు, మలమూత్రాదులగంపరోతకొంప, హంకృతితెంప । సలుపుచేమిటికికలుషముసుఖా। దుఃఖఁజెందునే ది యదిదేహము కలుగకర్తవనుటజీవునకు జన్మలయంబులటు గానమమతలణఁపుమనె. విను. 8

అతిశుద్ధమతినిర్మల, మాత్మవిజ్ఞానరూప, మచలమవ్యయంబుస్వజ్ఞానమున । వెతఁజెందిజీవుఁడు మోహితుఁడౌగాననీవుస, న్మతిచేనాత్మననిశంబు । నుతియింపుదారపుత్రా, దులయందువిరక్తిఁజెందు।సుతుఁడవువిశ్రవసునకు, సుఖముల్సతమనకు । క్షితి సుతరామునకిచ్చి రాజీ, వాక్షుని మఱుంగుఁజొచ్చి ।

బ్రతుకు మిల శేషశైలపతి, భక్తిరావణాయనిబల్కె శుకుఁడా
యెడనిఁక. విను. 9

8. అసావేరిరాగము - అటతాళము.

పల్లవి — పొలతియీచరితము, పొలఁతీతిలకింపవె.

అను. — లలితములౌశుకుని, పలుకులువినిపది, తలలవాఁడలిగి
శిఖవలెనైవానితోఁ । బలికెఁబ్రియమాడిబ్రతికెడినీవు, సిగ్గు
లేకజగత్ప్రభునినసుబోధింపవచ్చేవు, ఇపుడెచంపుదునిను ।
దలఁపవధకర్తుఁడవుగావిఁక, దలఁగిపోమూఢుఁడాయనవి
హ్వాలతచేఁజనె శుకుఁడుమును బ్రాహ్మణుఁడు వానప్రస్థగతి
నుండె. పొల.

సురలకుమేల్ కీడ, సురులకు చేయఁగసరణిశుకుఁడు నేయు
జన్నములుజెఱుపవజ్రదంష్ట్రుఁ । డరయఁగనొకనాఁడా, ధరణిసు
రునిడాయఁనగస్త్యముని । యరుదేరఁబూజించి యతఁడారగించి
పో, మ్మనమునియొప్పిపాయసాన్నము సేయ । తరివేచివజ్రదం
ష్ట్రాసురుఁడగస్త్యుఁడైవచ్చి, తగమాంసాన్నము వేయుమని
వేఁడిన । త్వర ఛాగమాంసముపంటకముపండిరి, మునీశ్వరుఁడు
భుజింపనయ్యెడవచ్చి కూర్చున్న । తఱిశుకునిభార్య నావేశిం,
చిరక్కసుఁడు మానికి । నరమాంసమిడిచనియెభ్రమియిం, చి
కూడుకూరలుముని । వరుఁడరసిమనుజామిష మెూగ్యమిది పెట్టితి
వనిశపించెన । సురవగుమనుచు నెఱుఁగననిశుకుఁ, డరువఁగా
ఘ్యా, నించిమునిపలికె. పొల. 1

అవిచారముచేసి, ట్లయ్యెనానుడిదప్ప దనఘుత్రేతాయు
గమున, రావణుఁజంప । రవికులమునహరి, రాముఁడైపుట్టినీ,
రధిగట్టుసమయమున, దశముఖుఁడంపఁ । దవిలిద్దూతకృ, త్య
మునకుఁజని రాముని, దర్శించెదవుముదమున, నకలంకమా । న.

వనీసురత్వమునీ,కబ్బునని చనేఁగుంభ, భవుఁడుశుకుఁడావిధము
న, సద్ద్విజుఁడయ్యె । నవలమాతామహుఁ డగుమాల్యవం
తుఁడు, సవినయమున దానవవిభుని గనిరాజా, అవనీసుతపురిఁ
జేరి, నదిమొదలుదుర్నిమిత్తములొాద, వెవినాశకరములై మే
ఘములు, గురిసెనెత్తురుజడి, శివలింగములు రోదనముఁజే,
సెడికరుల కొమ్ములునల్లనై, నవియావులీనెఖరములఁగని, గవి
సెనెలుకలుపిల్లితోననియె. పాల. 2

ఒకవింత దనుజేంద్ర, యొకబోడిముగవాఁడూ, రిక
నిల్లిల్లు దిరుగునిర్భయమున, వికటదంష్ట్రానన, వివరము దెలి
చుచు, నిక్కాకులముమునుతె, అఁగునినుసేతను, సకలేశుఁడగు
రామ, చంద్రునకిచ్చిమ! చ్చికవచ్చినీమఱుగుఁజొచ్చితినను । అకు
టిల కరుణాఢ్యుఁడై, నిన్నుగాచు శ్రీహరిరాముఁడై పరఁగు,
ననితత్త్వము । ప్రకటముగామాల్యవంతుఁడు దెల్పరో, పకపా
యితలోచనుఁడై రావణుఁడుమా । టికిదిక్పతులగెలిచినానవనీ
దేవమునిరూపుని । ఒకవేదమానవుని రాఘు, వునిశరణొందు
నామి । న్నకలంచములురిపులచేఁగొని, నావేమోగాన పొగడ
దెవరి, నీఁకబుద్ధిగాదుడుగుతాతని, యెంచినాను పొమ్మనిన
నతఁడరిగె. పాల. 3

రావణాసురువైభవముఁజూచి, రాముఁడు లక్ష్మణుని! చే
విలుగొనియర్ధచంద్రాస్త్ర, మావింటదొడిగినిండారదీసియేయ ।
నదియసురాధిపుపైఁజనియొక్కటి పదియూ । రై వెయ్యసంఖ్య
లను గడచి, పదితలల కిరీటములు బడగొని వెలిగొడుగుల ।
వేవేగద్రుంచి యవలీలఁబొడఁజేరెశర । మావేళదనుజాగ్రణి,
సిగ్గునగుందీ । వేవేగనంతగపురావాసమునకేఁగి ధీవరులవెరవరుల

శావించి, భావించి । లావునిర్భయముశరోత్సవమునాపైదయ
యుఁగల దేవీపులకు వారలాహవము, నేయుఁజనుఁడుమదా ।
జ్ఞావిముఖులరణభయులఁబీచమ, ణంతునన శేషాచల । దేవుఁ
డగురాఘవుని చేసనీఁ దెగిన మేలనితలంచిరందఱును. పా. 4

## ప్రథమయుద్ధారంభము.

### 9. నాటరాగము - ఝంపాతాళము..

పల్లవి —గౌరీవచోజితశారీవిను శ్రీమీఁజే.

అను.—శూరు, లైయనికిదివిజాసులేఁగుచోరణ । భేరీ, మృ
దంగముల్, పృథులశంఖారవముఁల్ । వారక మ్రోయించి
మహిషఖరహరికరి, వాహనములనారోహించి, ఘన । వైరి
భయదకరవాలగదాశూలభిండి, వాలచాపములు, ధరించి
యాయతంబైరి. గా.

అటకుమున్నే రాఘ, వాజ్ఞ చేవానరుల్ । పటు ఘోష
భీషణ, స్ఫుటశౌర్యులై మహా । విటపముల్ బలుగిరుల్, బెక
లించికొనివచ్చి।కుటిలరావణబలము, గూలు రాముఁడు గెల్పుఁ।
జటులజయమొందు లక్ష్మణుఁడినజుఁడరినోర్చు । నీటుజూడుఁడ
టంచుఁదలపడిరరులతో, నేపుమీఱికరణమొనరించునా।ప్ఫటుల
హనుమదంగదనీలకుముదశరభనలజాంబవత్సుషేణాది యోధ
వరులు. గౌరీ. 1

లంకవాకిళ్ళని, లావుమైకపులుని । శ్శంకనసురులనఖా
స్త్రములవిదళించఁగా । బింకములుదనుజులై, మ్మెయిఁబల్కిన
లిరేగి । పొంకమౌపురద్వారములవెడలియసితోమ । రాంకుశ
శరాళిచే, నగచరులగీలించి । అంకెలువైవఁగనిప్లవగులహితుల
చీ, రంబడంచిరాజితస్థలినిబహు । పంకమై మేదోమాంసరాశి

నెత్తురు, వంకలై పఱచెమహాద్భుతముగనయ్యెడను. గౌరి. 2

మరలిదితిజులుకరుల,హరులఁదేరులసతి । త్వరగఁబురికొ ల్పిసం, గరకేళిసల్పిర । త్తరివనేచరులున, ట్లనఁబేర్చిరిజయే చ్ఛగ । తరుచరుల్ రామభ,ద్ర దయార్ద్రదృష్టిచే । నెరపుబలము నుగల్గివెలసిరమృతముఁగొనిన । సురులవలెరావణా, సురుఁడలసీ తాచోరుఁడైనపాపమువలననిశి । చరులు, దొరలుదరలిరిలఁజతు ర్థాంశశేష, సైన్యములుబఱచెభయద్రుతంబులయికలఁగి. గౌరి.

తనబలముబిట్లొటఁ, గనికనత్కోపుఁడై । ఘనుఁడింద్ర జిత్తుమే, ఘములలోడాఁగిక్ర । న్ననశితాశుగవితా,నములొలి వర్షించె । వనజసంభవునివర, మునఁగన్నబ్రహ్మాస్త్ర । మున మర్కటానీక, ములనెల్లఁబడనేసె । నినకులమణికోదండదీక్షా గురుఁడ, య్యనుబ్రహ్మాస్త్రమునుమన్నించి, త । క్షణమూరక యుండిస్వబలములుగూలుటరసి । యనలసన్నిభ, జ్వాలద్భయద నేత్రుఁడయ్యె. గౌరి. 4

ధనువుఁదేలక్ష్మణా దనుజభస్మీకరిం । తును బ్రహ్మ సాయకం, బునఁజూడునాబలం । బనశేషాద్రిపతిబ, ల్కినవాఁ డుజననంత । వనచరులుపడుటఁగనుఁ, గొనిరాముఁడడలెహో హనుమంతక్షీరాబ్ధి, కావలదివ్యౌషధి జనకమగుద్రోణనామ గిరి గలదదివేఁ, గొనివచ్చికపులఁబ్రోవు, మనఁ, బావనిజవ, మునఁజనితెచ్చి, వనౌకసులసజీ, వనులఁజేసినగముమున్నటిచో నిడివచ్చె. గౌరి. 5.

## 10. ఆరభిరాగము - ఆదితాళము.

పల్ల వి.—సారదయాధురీణసంగీతవిద్యాప్రవీణావినవే.

అను.—ధీరులైనవారలుచెలఁగిభీక । రారవములనుఱంకెలు

వైచి। మీఱినవిపినిరావణుఁడు మదిని, నారసివందురి రాముఁడు
నాకెన్న దేవతానిర్మితుఁడైనవైరి। పోరనతనిఁజంపయూథపు
లెల్లఁ, బొండిటుసేయనివా, రిఁ జంపుదుననెను. సార.

రావణానతిసబలులై చనిధూ, మ్రాక్షయూపాక్షశోణి
తాక్షమ। హావీరమహాకాయప్రహ, స్తాకంపనమహోదరమహా
పార్శ్వులు। దేవాంతకనరాంతకాతికాయ, త్రిశిరప్రజంఘ
కుంభనికుంభు। లావనచరౌఘము, తోఁదలపడిరా। రావీరి
యద్భుతరౌద్రరసములే, మనందగు గదా ముసలాశుగతు।
రీవిశేషసాధనాళిచేవిద, ళించిరి దానవులుకపిసేనాపతుల. సా. 1

మర్కటుల్ బలియురై కొండలఁబెను, మ్రాఁకులఁ బండ్లఁ
గోళ్లఁబిడికిళ్లఁ। గర్కశపదఘట్టనశిలోరు, కరకపోలోదరము
ఖాంగములగల। మార్గానివైచిమోదికఁజిజీరి, మర్దించిత
న్నినవెఱనసురులె। దుర్గానరైరిలంకకై పాఱిరి। హుర్కార
శబ్దములాబలీముఖులు, కొలంకిడకబలుతఱిమిన ప్రహస్తుఁ।
డర్కకులచంద్రముదితాగచరబ, లాంబుధిఁ జెల్లెలికట్టకై వడి
నిలిపె. సార. 2

ఒకనిఁబడిటనూటవెయ్యింటవ। నొకసులనొక్కొక్క
ములికిఁగూల్చి। నికషాత్మజమంత్రిజయప్రశస్తి నెఱయనీలుఁడద
లించి పేర్చికడిమి। నొకతరువుఁబూనివానితేరుమీఁ, ధికిఁబోయి
సూతుఁ జంపిహయముల। మకురడఁచివిలుద్రుంచ నిలనిలిచి,
తికమక నొందకనాగకేతనుండిభంబుగతి రోఁకటనడువ నీలుఁ।
డొకటనొలసి తెలిసిపెక గిరివైచి, యుసువడి రావణు
మాతులుఁగూ బొరిగొనియె. సార. 3

తలలువీడగరక్కసుల్బర్వఁగని, తారాసూనుపై నరాంత

కుఁడు। చలమునహాయముఁదోలిశక్తినేయఁ, జలమున నంగదుఁడు వాజిపడనడచెన్। తలకొందకవాఁడురస్థలిఁ బిడికిటన్ వ్రేయ సోలివాలికొడుకటఁ, దెలివొందిముష్టిన్ బొడువఁ గుంది। వాలిసెనరారియు దేవాంతకుఁ డప్పు డంగదునిదాఁక హనుమంతుఁడాఁ। కలిగొనినపులోయనన్ ఎడఁజొచ్చి ఘనుఁడగు దేవాంతకుని రూపమడంచె సార. 4

అంతకాభీలుఁడగునీలుఁడు పె, ల్లార్వ మహోదరుఁడదల్చితన। దంతినిథేయనిడీకొల్పిపరిఘ తాటించినఁ గపిసేనాపతి నొచ్చిపంతంబుమీఱనగంబు గొని స, త్వరంబుగనేయఁగరితో నొరలి। గంతుగొనె మహోదరుఁడంతనె జంతరమునం ద్రిశిరుఁడ నిలసుతుని శరావృతుని జేయనతఁడరదమిం। తింతలుగఁజేసివారి మూఁడుతలలిలఁగూల్చె వజ్రము గిరింగూల్చులాగున. సార. 5

అంజనీతనయునిగదన్ గొనిధూ, మ్రాక్షుఁడేసిన బిట్టలిగి ప్లవగ। కుంజరుఁడురుశైలము దెచ్చివైవఁ, గూలెవజ్రధారఁబడు బలునికరణి। కెంజాయకనుల్మిడిబడినబొమలు పెంజీఁకటినేలుమై తొడవుల। రంజిల నకంపనుఁడు తేరెక్కి వీకన్। శింజినిమ్రోయించి పావని మైశితాస్త్రములఁ, జించఁగ సకోపుఁడై ప్రభంజనాత్మజుఁడు మ్రానిచేవాని, భంజించెన్ దేవతలు జేజేయనఁగ. సా.

గదఁబట్టుకద్రిప్పి మహాపార్శ్వుఁడు కాలాగ్నిసన్నిభు ఋషభునేయఁ। జదికిలపడిమూర్ఛిలితేరి ఱొమ్ముపృథులకీశవరుఁడు బొడువవాఁడీల్గెన్। విదితుఁడై మహాకాయుఁడరదంబువెసంబఱపి సజ్యకార్ముకుఁడై। బెదరకుఁడీకపులారా వినుఁడీ। కదనమువీరాగ్రేసరుఁడగురాఘవేశుతోఁగానిసేయమాతం। త్రిదివిజుల గెలిచెఁ గైలాసమెత్తె, నేపనుగావుననలఁతిగాననిపల్కె. సా. 7

అంగదుఁడు మహాకాయునిగనియా, హాఁజాలేలమీాయ
య్యనను నెఱుంగుదుఁదోఁకనుజుట్టిపయోధి, లోఁముంచఁడెమా
తండ్రిమున్నెఱుఁగవా। వెంగలీయనుచుఁబాదపమువైవ, విశి
ఖంబునఁద్రుంచిబాణవృష్టి । నంగదుముంచిగదన్ గొనసాల
యుఁగ । చొంగదొరంగఁబడెన్ గపులడలెన్, సురారియైదింటఁ
బడిట నొకటఁజె । లంగి మాఁటనూటవలని, లగవయగజగ
వాతానిల సుతాదులనేసె సా. 8

అంతనంగదుఁడు తెలివొందిఘన, గదాయుతభుజుఁడై
మహాకాయుర । థాంతమునకుఁజనిహరిసూతకే, తనచాపముల్
నుఱుమాడె నిర్వ్యగ్రగదల్। వింతగాఁగొనిపోరనవివాడియయ్యె
వియన్ మల్లయుద్ధమునదుందుభి । నంతమొనర్చిన వాలియన
లావునకు నందఅనద్ధనుజున్ బొడిచివడిన్ రణోర్విఁదలఁద్రెవ్వ
శ్రీరఘురాము । చెంతకేఁగిమ్రొక్కిన వాలిసుతు శేష గిరిం
ద్రుఁడుగౌఁగిలించెను జెలఁగి సారద. 9

## అతికాయయుద్ధము.

### 11. శ్రీరాగము - త్రిపుటతాళము.

పల్లవి —ఆర్యసమ్మతమైహితంబగు, నార్యయీాచరితమువినవే.

అను —శౌర్య, ఘనగాంభీర్య, సమరచా, తుర్య, దిసహాయుఁ
డై యతికాయుఁడై । శ్వర్యవిభవములనుసరింపన, వార్యమై
గుణరవముమ్రోయన్ । సూర్యనిభమగు రథముఁబఱపి
య, సురావళినోడఁకుఁడనిపలికె. నార్య.

బాణా, సారమునవనచర సేనా, నాయకులత్రుళ్ళడఁగిం
చిదీ, నానాథులఁజంపకరామక్ష్మానాథు నెదిరిసు, జ్ఞానమూహించి
రావణసూనుఁడదలించి । మానమేలేదు, ఏనెళవుగాదు ఏనీతి

యురాదు, మాతోవాదుఁ। బూనిమానిసివై నావు గుణహీనుఁ
డవుకులగోత్ర మెఱుఁగని। వానికిపుడొదవెనిన్ని యును,సమానుఁ
డవె మాతో ననిపలికె. నార్య. 1

మీూనై, యంబుధిఁజొచ్చినా, గాని, చట్టుమోసినాగాని
క్షోణిక్రోడీకరించినాగాని, మూనెక్కిపండ్లిగిలించినా। గాని, భి
క్షుఁడవై నటించినఁ, గానిగూనిబాపఁడవైనా। గాని, దొరతనము
మాని, మానివైనాముసలివైనా। గానీ, శాంతిగొనిపోరుడిగిన
గలికివయినాగాని నినుబో।నీను నీమీఁదనిడినతలఁపు, మానన
నెహరితో నసురవరుఁ డార్య. 2

జ్వాలా, భీలంబౌదావాగ్ని, లీల, లక్ష్మణదేవుఁడెదిరించి।
యేలరా పడుచరజ్జులుచాలా, ప్రేలెదవుచక్కఁగానిలువునీక్రొవ్వ
డంతు జేజేలలరననిన। చాలు, సౌమిత్రి, గోలవీవు పెక్కాల్ఱ
ములతెఱఁగు, లెఱుఁ, గవుజరుగు। కాలభుజగాభశరజాలము,
పాలుగావలదనదనుజుఁను। ద్వేలఫాలమున నెత్తురొలుక, వాల
ష్మగిలించె లక్ష్మణుఁ డార్య. 3

దానబలో నొచ్చియిఘనుఁ, డేనన్నెర్వఁగఁ జాలునని,
యంప। వానచేముంచెరావణి, రామానుజునతఁడ। స్త్రానలముచే
దానిమాన్పఁగవానిమైతూఁపుల। వేనవేల్నించఁగా నిష్ఫల
మయ్యెహీనుననుఁ జేసినమేల్కారణినా। లోనపవనుఁడు వచ్చియ
జుచే। దానవుఁడువజ్రకవచముగొని। పూనెనని తెలిపిచనరఘు
కులుఁ, డానిశాటునికవచముసుదునిమె. నార్య. 4

ధీరుల్, దానవమానవరాజవీరుల్ది వ్యాస్త్రముల్పరగించి।
వేరల్కఁ హరిహరికరికరి నొరసినపరుసున। పిరుతివకగెలుపును
బ్బునఁబోరిరరుదారఁ। ఘోరశరక్షత శరీరులై గైరికాగ క్షశైల

ములన, నొప్పిరికలన। నారినరిఁబోసి బ్రహ్మాస్త్రము దారమంత్రా
న్వితముగానిం। డారఁదీసి మనుకులుఁ డేయసురారిసుతుతలఁదు
నిమెఁ దుది నది. యార్య. 5

ఆలో, దేవత లానందమునఁ బూలవానలుగురియించిరి।
చాలా, భక్తినతుల్ జేసినతమ్ము, నాలింగనమూని మైనిమిరెఁ గర
మునద, యాలోలుఁ డయ్యెన్నృహరి బాళిగపులుని, ర్వేలహర్షా
బ్ధిఁ, దేలి రదిజూచి, సైఁచక నేచి। కాలయములనఁ గుంభనికుం
భులోలిరణకేళినగచరులం। దోలితజేమినవారిఁజంపిరి వాలిత
మ్ముఁడునతనికొమరుఁడు. నార్య. 6

యూపాక్షుండు ప్రజంఘుఁడు మైందుతోఁబోరాడి రణో
ర్విఁగూలిరి। కోపోద్దీపితుఁడై శోణితాక్షునిరూపణఅ ద్వివిదుఁడు
బొడిచి పాదమునఁ బ్రామెఁ బ్ర। తాపమునువొంద బాపురే
యనిధూమ్రాక్షుని హనుమంతుఁ! డేపునఁ దెగటార్చి, యూ
ర్చెను బేర్చ। ఆపదలఁబడిపఱచిహత శేషాసురులు రావణునకె
ఱుఁగఁ। రూపించిరతికాయుఁడీల్గుట, యును శేషగిరిపుని రాముని
జయ. మార్య. 7

## రావణుని ప్రథమయుద్ధము.

### 12. గౌళరాగము - ఆదితాళము.

పల్లవి.—సూరిజనసౌఖ్యదాయినీ యీ, సుచరితము సుధీ సు
వ్రతము కాత్యాయనీ.

అను.—పోరనతికాయాదిఘనుల్ బడుట, కారాటపడి రావణుఁ
డుకసుల్ప! మీరసంయుతాగ్ని నెనయగా, ఖరారిపైఁ జనఁగా
మదినెంచిపగ। మీఱినింద్రజిత్తులంక కాపిడిసమిదూర్జితంబై

బలంబునడువక, భూరి సాయుధమగురథ మెక్కి, పొగరునని
క్కి, నడచెను ద్రొక్కి సూరి.

వింట, గొనయుమిడికపులనదరంట, శరములనేసి చంపె।
దంట, యనుచు నినసుతాదులవెంట, నంటి। మంటలఁదరునారా
చములచే మదమడంచిబెబ్బులివేరాఁకట। నొంటిఁబడి వచ్చు
పోల్కిదశా, ననుండు హరిగదిసెనదిగని త్రిదశ।కంటకు నెదిరి
విభీషణుఁడుగదాకనద్బాహుఁడై తాఁకనతనిపై । నంటిన పగమ
యదత్తశక్తి, నన్నుసశక్తి, నేసెనుయుక్తి సూరి. 1

అయ్య, స్త్రముగనినాచేవర మియ్యఁ, బడినతఁడు వధకు
దగఁ। డయ్యా, యనిన సౌమిత్రినృపు నెయ్యమెఱింగి। చయ్య,
నఁబిఱిందికి విభీషణునొయ్యఁ, దిగిచివిల్గొనియనికి గ।రియ్యుండై
నిలచెశక్తివచ్చి, నరేంద్రసుతుఁ జొచ్చి వెలిఁగెను హెచ్చి।
డయ్యఁడయ్యె సకలశక్త్యాశ్రయుం, డనంతుఁడుహరికి తనువు
నగునతని। కెయ్యెది దుర్భరంబటులైన, నిఁబడెదాన, నరభా
వాన. సూరి 2

సోలి, పడియున్న లక్ష్మణుని, జాలి కరములనెత్తఁ
బోయి। వ్రాలి, రావణుఁడుసిగ్గుపడే, జాలి జగతికి। మూల
మైతగు విరాట్పురుషుఁడై, పొదలువిష్ణుగదల పగసురారి।
కేలీ, లనగు రావణుగనియొకింతలోనఁజని, పావనియశని।। బోలు
పిడికిటనుబొడువమోకాళ్లు,భువిఁ మోదఁబడి యతఁడు ముక్కు
లఁ। జాలరుధిరముగ్రక్కలక్ష్మణుఁ, సామీరిఘనుం, డైకొ
నిచనెను. సూరి. 3

రామ, త్రైలోనాథుఁడనిలజుని, సామ, ర్థ్యముఁ బ్రియ
ముఁగనిపొగడె। భీమా, టోపమున ధనుర్ధరుఁ, డై మారుతి

నెక్కి । కాముగెలుచునాటి, రుద్రునివలె, గదియఁ దెలిసిదనుజ
కిరీటి మ । హాహర్షమునఁదేరెక్కి రాగ, నరాధిపుఁడు బాగా,
అదల్చిపోగా । పామరాధమా బ్రతికిపోలే మపరాధముస్వసర
ముఁడనైన నా । కేమిటికిఁజేసితివినిసుభళీ, యిలకిడుదు బలి,
యనెఁగడుఁగెరలి. సూరి. 4

శ్రీరా, మునినుడివినివాహనమై రా, జిలు హనుమంతు
నేనెఁ । క్రూరా,స్త్రముల రావణుఁడు కపి, వీరాగ్రణినొచ్చి ।
భూరితేజోబలంబునవృద్ధిఁ, బొందెఘృతమ్ము చేనగ్నివలెఁ రఘు ।
వీరుఁడపుడంజనికొమరుని, వివిక్తసవ్రణునిఁ, గని రావణుని ।
తేరుగుఱ్ఱములుగొడుగువిల్సార, థికేతువులఁద్రుంచి యరచందు
రుల । కోరి యిలబడల్చెకిరీటము, ల్గూల్చెరవిసము, ల్లసత్ప్రి
భముల్. సూరి. 5

బాణా, వళినొచ్చి నావిపుడు, ప్రాణా, లతోఁబోశ్రమ
ముదీఱఁ । గోణా, ధిపానాబలమరయ, జాణ, వై రేపురా ।
కానీ, యని నృహరివలుకవా, క్కాండములనునొచ్చి సిగ్గరిక ।
రేణు, పతిమృగపతిచేఁ బడియరిందివిడువఁబడి, పఱుచుకై వడి ।
మానమేదిరావణుఁడుబాఱి కడువడిఁ లంకఁజొచ్చి మదినెంచె
నా । శ్రీనివాసుఁడే రాముఁడు ధరణి, శేషగిరిధని, యనఁబరగె
నని. సూరి. 6

### 13. తోడిరాగము - అటతాళము.

పల్లవి — కామసంజీవనౌషధికల్పలతా, శ్రీమేనకాసుతా వినవే.
అను.— ఆమీఁదవగచెరామచంద్రుఁడు, హాలక్ష్మణా హాయని
విలపించెను. కామ.

తాను విష్ణుఁడైననుమాయ, చేసుజగమునెల్లను మోహింపఁ । గానుమదినెంచినెనరుమించి క్షోణిపైఁబడిమూర్ఛ ప్రక్కియున్న।వానిఁ జూచి కన్నీరునించి । నానోముఫలమా నాపెన్నిధానమానానీడనాతోడనేనీతోడఁ। బూనిరాఁదలఁచిని నుబిలిచినగానిపల్కవదేకోపమా । నేనన్నుఁడనే కరుణఁజూడఁ గదేనన్ను గన్నులలరగననెన్నృహరి. కామ. 1

అంత రాముఁడు, చింతాకులుఁడై ధీమంతా యోహాను, మంతారానా । సంతాపముఁదీర్పు, మాసంజీవినిపంతముతోఁ దెచ్చిప్రాణములిచ్చియీా, పట్లతమ్మునిఁజేర్చుమా । మంతుకెక్క నీమహిమనిన కొం, డంతై పావని మ్రొక్కి చనె నాచక్కి । అంతయునుజారులవలనవిని, యసురపతికాలనేమి గృహా । భ్యంతరముఁజేర వాఁడతని స, పర్యలఁదనిపి, కార్య మేమని యడిగె. కామ. 2

రామానుజు ప్రాణ, మీామారుతిదివ్యసామగ్రికిఁబోయె. నామార్గమునవిఘ్న । మామాయలుబన్ని, యీారేయిగడుపునీ మేలుమఱువ న, నినదశాస్యునికాల । నేమిబోధించెనెన్ని, మామారీచుఁ । డేమాయనట్లనె నేననుమాన, మేదిరావణానీ జీవన । మేమిహితసుతపౌత్రబాంధవు, లీల్గిరవనిజచేసిరులచే నేమి, తనువేలహరికిసీత, నీరాజ్యము విభీషణుని కిమ్మనెను. కా.

మునివై యడవికిఁ జనివై దికకర్మఖనివై విజనస్థ, లినివై తగునునికి। గొనివై రాగ్యమునవిషయాసక్తి, జనునింద్రియము లమె । ల్లనఁదిగిచిపరమాత్మ నెనయించిచిత్తమున। నిను ప్రకృతికి విలక్షణు, నిగాఁదలపోయు । మనఘచరాచరజగము, బుధ్యాది కముకన వినఁబడెడి దేదిచతురా । ననుఁడుమునుతృణముతుద

యోనిదివిను ప్రకృతిజన, జననలయ కారణమదియే మాయ, యనఁ
బడున నెనతఁడు, కామ. 4

శ్యామా, ర్ణశుక్ల, ధామా, కృతి బ్రజల। నామా, య
సృజియించి, కామ, క్రోధాది। నామా, ద్భుతసుతులను, హింసే
చ్ఛాది। భామినులఁగనియదిబహు, ళాళిఁజెందించఁ బరమాత్మ
నీగతులను। యేమియొల్లనియాత్మేశునందదిస్వగుణ। స్తోమము
నారోపించు దీపించు। స్వామి, నిర్మలుఁ డైనను బ్రకృతి,
సంగియై వెలిగని భ్రమసితను। దామసచిగుణ మోహితునిగా,
దలఁచితను దెలియు క్రియవినుమ నెనతఁడు. కామ. 5

ఏకా, లమునవి వేకా, ధ్యండయిన, శ్రీకా, రణగురుని
చేకా, యిక మోహా। శోకా, దికము లేనివానిగాఁ దెలియఁ,
జేకుఉన త్తటి మరల్చిచూడ్కిగను నాత్మ, జీవన్ముక్తుఁడయి
ప్రాణి। ప్రాకృతగుణముల చేఁబడక నీవునిన్ను, పరిశీలించుయ
థానీకశి। శోకరుణరతుఁడవయి ప్రకృతి, కవలి వెలుఁగనియా
త్మనుఁదెలియు। నీకొదవుము క్తియదిబళువే, నిసగుణాత్మ ధ్యాన
మును జేయుమనె కామ. 6

ఉదయా, ర్కోజ్వల, హృదయా, బ్జకర్ణికా, భ్యుదయా
సనమున, సదయామతిసీత। గదియనలరువాని, కన్దవయుదుశై,
పొదలువాని మెఱుపుబోలుచేలము వానికదలునందెల వాని।
విదిత, వనమాలాన్వితుని గౌస్తుభహారాంగదకటకకిరీటుని,
వీరాసనుని। ముదమొదవ కేలుదోయివిల్లు, మ్ములఁదాల్చి
శోల్చులక్ష్మణుతో। సదరహాసముగఁబల్కు రాము, చంద్రు
ధ్యానింపు, మధిపాయ నెనతఁడు. కామ. 7

ఈరీ, తిగహరిచారి, త్రమువినుము, చేరి, శుభములవా

రిజ, న్మానుసారి, గావచ్చినదురితౌఘములు, తారిచెడుగార్చిచ్చు। దారిలోదూడికంట్లము నిల్చి హెచ్చునా। సారా, చారవిచార పౌలస్త్యవీరవైరముమాని, భక్తిఁబూని। శ్రీరాముఁబరిపూర్ణ నాకనిసదారూఢ భావభావితునిశ। రిరసామరహితుని శేషా, ద్రినివాసుఁదలఁపుమనెమారీచజూఁడు. శాము. 8

14. కన్నడరాగము - ఝంపతాళము.

పల్లవి.—శరణాగతసంభరణా। వరకుండలయుగళీకృతతుహిన కరచండకిరణావనవే.

అను.—పరతత్వాశ్రయమహాత్మ్యాదృసుధాత్వ। పరఁటిఁబల్కు కాలనేమిపయిఁ రావణుఁడు। కెరలితప్తఘృతంబునజలంబు బడినక్రియ। మెఱసినినునీచుఁద్రుంతు నామాటమీరితి వరులచే, లంచముబుగ్రహించి రామకింకరుఁడవై గురుని పోల్కిబోధించెదవరరేయనఁగినుకవల, దంచుగదిలెవాఁడు. శరణా.

హిమవన్నగపార్శ్వమునవనమురచి, యుంచికాలనేమి మునివలెనుండెనుమించి। సమీరసుతునిభ్రమించఁ దలంచి। అమితజవంబునను, గపివంశమణివై, హాయసాధ్వనేగుచో ఋష్యాశ్రమముగని। తెమలితోఁవ, తొలఁగెననికలఁగి యీసం। యమినడిగిపోదమనుచుఁ బోయితత్పాదములకు, మ్రొక్కి. దేవ రామభద్రదూతనుహ। నుమంతుఁడనఁదగువాఁడఁదృష్ణాతు రుఁడనుద, కముఁజూపుత్రావిపోయెదననిపలికె. శరణా. 1

అమృతోపమవాఁకమండలంబుతో, యంబుద్రావుఫల నిచయంబుదినువినుతంబు। సమ్మంత్రముగనిత్తు నౌషధంబు।

సమరతలంబునఁ బడినలక్ష్మణుఁడెలమి, సమరసర్వకాలవేత్తను
గానఁదెలిసెను । శ్రమముదీర్చుకరేపు బొమ్ము రేపకడనని। తమక
మున మానిపలుకఁగుంభజలమల్పము, కొమరునసరస్సువటుని
బంపిరూపింపు । సుమహితయనుబవమానసుతు వెంటశిష్యానం
పిమడువుఁజూపిరమ్మనెఁగపటముని. శరణా. 2

కొలనాద్విజుచేననిలజుఁడుగాంచి, కోర్కెమించికనులు
ముకుళించిప్రవేశించి । జలంబుద్రావెనుసంభ్రమించి । బలుమకరి
మ్రింగెనుహరిప్రవరు తడఁబడకతండుహస్తములనడువఁగ వెస
మొసలితలబ । గిలిమృతిఁదైయిమదవతియైచూపట్టె । బలియుఁడభ
వద్దయనుశాండిల్యశాపము, బొలిసెనేధాన్యమాలియగ సురాం
గనను । వలదుమునియనుచు నమ్మనిటముగనిన, వానిజంపివి
జయముంజేయుమనియదిచనె. శరణా. 3

అతివేగమెయాంజనేయుఁడటుబోవ హాయిదేమియింత
కురామియుపదేశమి । త్తుతత్వదక్షిణయీగురుస్వామి । కుతుక
మునందినమేలనఁగ గొమ్మనుచుఁ, గుటి, లయతినిముష్టిఁబొడువ
సురా । హితుఁడపుడు మతకములుబన్నంగమరున్నందనుఁడన్ని
వితగానొనర్చి కాలనేమినివధించెవి, తతమాయికునిభటుండు
మాయలఁగబడునె । శ్రితహితుఁడాక్షీరాబ్ధిఁదాటిద్రోణగిరి
యౌషధములనుగానకగిరిఁదెచ్చె. శరణా. 4

ధరణీధరమత్తతిమారుతిడించిరాము, ధరణీశుపాదసరో
రుహములజొహారు । శిరంబొరయ సల్పెనువేమారు। నర, హరి
యాదరణమెఱయఁబ్లవగకే, సరికుమారుఁ గౌఁగిలించె సుషేణుఁ
డౌషధ । వరముగొనిసౌమిత్రికిశ్రీమీఱఁజికిత్స । నెఱపెనట
నిద్రవోయి లేచినటులనెంచి, నిలునిలుదశాననపొరిగొందు నీవె

